స్వదేశీ

# శశిరేఖా పరిణయము

## నాటకము.

గ్రంథకర్త :

బూరుగుపల్లి
వేంకటనృసింహాఖ్యుడు

---

ప్రకాశకులు :

**కొండా శంకరయ్య**
**బుక్‌సెల్లర్స్ అండ్ పబ్లిషర్స్**
**శికంద్రాబాద్ (దక్కన్)**

బ్రాంచీలు:— హైద్రాబాద్ & వరంగల్.

1954



వెల 1-0-0

శ్రీమతే రామానుజాయనమః

స్వదేశీ

# శశిరేఖా పరిణయ నాటకము

గ్రంథకర్త:

బూర్గుపల్లి వెంకటనర్సయాఖ్యుఁడు



ప్రకాశకులు

కొండా శంకరయ్య

పుస్తకముల వ్యాపారము సికింద్రాబాద్,

బ్రాంచీలు:— హైదరాబాద్ అండ్ వరంగల్

 [వెల 1-0-0

శ్రీమతే రామానుజాయనమః



# శశిరేఖా పరిణయ నాటకము

—————:0:—————

శా॥ శ్రీలక్ష్మీధవ సామజాధిపనుతా । క్షీరాబ్ధి జామావ్రిభా
ఫాలాగ్రేసర మౌని వందితపదా । పంకేజ పత్రేక్షణా
లోలాక్షీజన పంచబాణ విపులా । లోకేశ సంపూజితా
మాలోనమ్మితిమయ్య బ్రోవుమికవో । మానాల పౌరీశ్వరా॥

సూత్రధారి ప్రవేశము

వ॥ ఆహా సంతోషము సంతోషము. యీ సభా మంటపమునందు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రాది జనంబులు తమతమ కులాచార ధర్మంబుల పవిత్రింపుచు పూర్వజన్మ దుష్కృతంబులంబాయ హరినామ కీర్తనంబు వినంగోరి యిచ్చటికి విచ్చేసియున్నవారే సరి వీరికి కర్ణానందంబుగా నొక్క పుణ్యకథ వినంజేయ విచారించుటకు మత్సతీల లామయగు నటిని రావించెద గాక.

సూ—దరువు॥ రావేసటీ సరాసరిగా భావంబురంజిలగా మరిగా దేవేశు కీర్తి శోభితంబే విన్నవించుటేహితం ॥రా॥ గోవిదులకు ఇంపుగ నీగీతకళా వాశ్చాతురి మెరయఁగా। ద్రోక్కెల గుంపులు మెరయఁగ శీలా గుణాలా తడవేలా రావేలా ॥రా॥ మన్నించుమూనాలూరి కన్నియ [illegible] [illegible]యగుంబున శ్రీ [illegible] [illegible] [illegible]

వ॥ నటి సింహాసనాకి [illegible].

నటి ప్రవేశము.

వ॥ నాథా నమస్కరించెద.

సూ—వ॥ చెలీ వర్ధిల్లుము.

నటి—దర్వు. నన్నుబిల్చు కారణంబదేమి శూర విన్నవించవేలనిన్ను బాయజాలను॥ తన్నువారికిని పిన్నవారికిని ప్రసన్నుడవై వెలయుందునీ॥ కన్న ఘనులు తెలిసెంచు యెన్నోవిధంబుల నెన్నికంబున ॥న॥ నిన్ను ధ్యానింతు న్యాయంబటంచు సు శ్రేయమటంచు మన్నించ నీవే సమర్థుండవంచు ధీరా సువిచారా సుకుమార మనోహర ॥న॥ మానాల పురీశుడౌ హరినీ పూని నుతించిన చాల దయబూని బ్రోచునిను శీల కవిలోల గుణజాలా కరుణాల వాలా ధరలో ॥నన్ను॥

వ॥ నాథా నన్నిచటికి రావించు కారణంబెయ్యదియో వక్కాణించుడు.

సూ—వ॥ మనోహరీ యీసభాసదులొక పుణ్యకథ వినంగోరి యిచ్చటికి విచ్చేసియున్నారు కావున వీరి మనంబు రంజింపగోరి హరినామ కీర్తన వినంజేయ నిన్నిచ్చటికి రావించితి.

నటి—వ॥ మనోహరా యెట్టి పుణ్యకథలైన భగవత్కథలతో సమానంబు రావని విందును. కావున మీ రనువిధంబున నే శశిరేఖా పరిణయంబు వినుపింప నాకిష్టంబై యున్నది. మీ కిష్టంబెయ్యదియో శృత పరచుడు.

సూ—వ॥ ఆహా సఖీమణీ నామనంబైన నట్టులే కోరియున్నదిగదా.

నటి—వ॥ సరి మంచిదిగాని యిట్టి శశిరేఖా నాటకంబును క్రొత్తగా నెవరు రచించిరో వారి నామధేయంబు విన్నవించుడు.

సూ—వ॥ సరి వినిపించెద వినుము.

సీ॥ శ్రీరమ్యకరమగు జిల్లాకరీంనగర్ । తాలూకజగిత్యాల ధర్మభూమి ।
ఘనదీపకొండ పర్గణాలో ఎలక్ వెల్గు । మానాలపురమందు పూని
యుండు । బలుగూరి రాజక్క పరమగుణాఢ్యయా । దొరసానిగారు
సత్వరమందమున । నామ వశాంబోధి సోముడామ్మకర్తారి । ఘనుడగు
గోపాల్ రావు కాంతతోడ । వీరలిరువురు సత్కీర్తి కోర్కెలొ

ముదముతో శశిరేఖ నాటకంబు । అరయ శాల్మలిపురి వెంకటాఖ్యు
బిలచి । రచన జేయించి రిలమెచ్చ రమ్యముగను॥

వ॥ సఖీమణీ జగిత్యాల తాలూకాలోనుండబడె మానాలపురవాసు
లైన బలుగూరి రాజక్క దొరసానిగారు ఆంముఖ్తారినామగోనాల్ రావు
దొరవారు వీర లిరువురు కీర్తికపేక్షించి యిట్టి శశిరేఖా పరిణయ నాట
కంబు బూర్గుపల్లి వెంకటాఖ్యుగారిచే రచియింపించి జగత్ప్రసిద్ధిగా మన
కొసగినది సత్యమేకదా.

నటి—వ॥ ఔనౌను గాని యిట్టి బలుగూరి రాజక్క దొరసాని
గారికి దత్తపుత్రులు గలరని వింటిను వారివారి నామధేయంబులు వినం
గోరుచున్నదానను వినిపింపుడు.

సూ—వ॥ సరె తెల్పెద వినుము.

గీ॥ శ్రీమహిత గండ్రవంశాబ్ధి సోములైన । లలిత బుచ్చిరాజేశ్వర
రావుగుణుడు । రామరావుఘనుండు సుత్రామ విభుడు । రమణి బలుగూరి
వెంకటరావు వినుమ॥

వ॥ సఖీమణీ గుణవంతులైనట్టి గండ్రి బుచ్చిరాజేశ్వరరావు దొర
వారు వ రాంరావు దొరవారు బలుగూరి వెంకట్రావు దొరవారు యీ
ముగ్వురు మన దొరసానిగారికి దత్తపుత్రులన విందుముగదా.

నటి—వ॥ సరె వింటినిగాని యీనాటకంబునకు యింకా కొందరు
గ్రామస్తులు సహాయమైనరన విందును వారివారి నామంబులు విన్నవించ
వలయును.

సూ—వ॥ సరి తెలిపెద వినుము.

సీ॥ శ్రీమంతులై క్షోణి చెన్నొందు బలుగూరి । నర్సింగరావు హన్మంత
రావు । వైశ్యరత్నములయ్యి వసుధపై పెంపొందు । పుత్తూరివీరయ్య
వుత్తముండు । బండ వెంకయ్య సంపన్నుండు మరిగంప । గోపయ్య
తామంచి గుణయుతుండు । ముక్కవీరయ్య ఆమోద మానసుడిల ।
శౌరిభక్తులు మహోత్సాహపరులు । యెడపల్లి సాహేబు యెడపల్లి
వీరప్ప । యెడపల్లి క్రిష్టయ్య యెంతో ఘనుడు । యెడపల్లి హన్మంతు
యెడపల్లి వరచిన్న । హన్మయ్య చిన్న వీరప్ప హితుడు । జైశెట్టి
పెద్దరాజయ్య గుణాఢ్యుండు । జైశెట్టివంశ రాజయ్య ఘనుడు । వీరలం

వరు ఉటుకూరి గారియాజ్ఞ । మీరలకను యిట్టి నాటకముమీాది ప్రేమ । గల్గి కీర్తి వహించి ఘనముదమున । అర్థమొసగుట కెంతో సహాయు లైరి॥

వ॥ మనోహారీ అట్టి గ్రామస్థులగు బలుగూరి నర్సింగరావు దొర వారు బలుగూరి హనుమంతరావు దొరవారు యింకా వైశ్యరత్నములగు వుత్తూరి లి. గయ్య బండ వెంకయ్య గంప గోపయ్య ముక్కా వీరయ్య వీరు నలుగురున్న యెడపల్లి సాహేబు యెడపల్లి వీరప్ప యెడపల్లి క్రిష్ణయ్య యెడపల్లి కరోహానుమంతు యెడపల్లి చిన్నహనుమయ్య యెడపల్లి చిన్న వీరప్ప జైశెట్టి పెద్ద రాజయ్య జైశెట్టి చిన బుచ్చిరాజము వీరలందరు యీా నాటకమునకు కొంత ద్రవ్యమొసంగి కీర్తి వహించిరిగదా.

న—వ॥ అహాహా సంతోషము సంతోషము మనోహారా వీరి నందరి నెల్లప్పుడు అట్టి మానాల వెంకటేశ్వరుండు రక్షించుగాక.

సూ—వ॥ మనోహారీ నీసంతోషంబున కేను మెచ్చితినిగాని యీా సభ్యులెల్ల రాణించునట్లు నీవొకసారి యిదే వసంతకాలమును వర్ణించి నా మనంబానందింప జేయుము.

నటి—సీ॥ నవపల్లవ ప్రసూనముల నొప్పుచువృక్ష । పుంజములతి రమ్య ములువహించె । చిలుకలు కోవెలల్ చెలరేగి చివురుజొం । పముల మెక్కుచుబల్కె వత్తునొంది । నలినాకరంబుల వెలసి మారుత మెల్ల । దిశల భూనభముల విశదనుయ్యె । సమయమిదేయంచు కమలాస్త్రి వీక్షించి । నునుశరంబుల మత్సరమున నేయ । మగల మగువలు కౌగిట బిగియజేర్చి । స్నేహములుజేసిపాయని మోహ మునను । నవరతుల దేలి సౌఖ్యంబు లవనిగాంచి । మేలనుభవించు వాసంత కాలమిదియు॥

దర్వు॥ ఇంతనియు వసంతకాల మెన్నగవశమ । కాంతా గుణవంతా ధీమంతా నామంతనమున ॥యి॥ అదుగదుగో పూర్ణచంద్రుని చల్లదనం బతి శయమయ్యెండెన్ । మదన శరపరంపరలకు యువతులమదిమృదువై గరుగుచుండెన్ । కోవెల గుంపులు కోయనియార్చగరాన । జీవనజాతులు జీవితేశులవై । భావములన్ । భ్రాంతులడన్ । తాపన్ హరించి తరింపిడి యావదగు ॥నం॥ మంతవమున మానాలపురీశుని । చింతించిన సిరులిచ్చున్

నేడంతో నేడంతో సౌఖ్యములు హెచ్చు — కాంతజనా — కాంతమన సంతోషములకు సమయంబిదేసుమి ॥యింత॥

సూ-వ॥ సరి మనోహారీ నేడిదే సభామందిరమునకు బలరామస్వామి యుద్ధవ సమేతంబుగా విచ్చేయుచున్నవారలు కావున మనమిచ్చట నుండుట సమంజసముకా దావలకు బోదము రమ్ము.

న-వ॥ నాథా చిత్తము (అని నిష్క్రమింతురు)

యాదవసభా

బలరామదేవోద్ధవ ప్రవేశము - దర్వు.

బలరామ నామధేయుడ ॥బ॥ కామసుందరుండ ఘనుడను ॥బల॥ శ్యామవర్ణ నగ్రజుడను సురముని సుత్రామవందితుండ ఘనభుజబల ॥బల॥ భూభారం బడంచుటకై భూలోక హితంబుగబల్ । ప్రాభవమున జన్మించిన పరమాత్మ ప్రకాశుడ ॥బ॥ లాలితమగు యాభువి మానాల పురీశుండును । శ్రీలోలుని నమ్మిన నతజనపాల పరాయణుడను ॥బ॥

వ॥ ఉద్ధవా.

యు-వ॥ హే మహాప్రభో యేమియాజ్ఞ.

వాదం.

బ॥ యదుకులాబ్ధి శశిక హితులకుమేలే । మేలే పీలేపీలే । మేలే సదానంద సౌఖ్యదాయకుండగు । మదాను జన్మునికి ధాత్రి ॥యదు॥

సీ॥ వాసిపురాణేతి హాసజ్ఞులాధరా । నిర్జరుల్ హరిభక్తి నిష్ఠమతులే । సకలరాజన్యులు జనసమ్మతంబుగ । వర్తింపుదురె రాజ్య వైభవముల సద్వైశ్యులిల మహా సత్యవాక్యధురీణు । లై సర్వకృతుల యందమిత యశులె । గోధనంబులనొప్పి యాధరా మరులకు । శుశ్రూషజేతురె శూద్రజనులు । వందిజనములు కీర్తింప నందసుతుడు । నలిన వాసిని గూడి యానందమునను । యున్నదేశభక్త జనుల కత్యున్నతముగ । భోగ భాగ్యములిచ్చి పెంపును వహించి॥

వ॥ ఉద్ధవా సెబల్కు-నట్లు సద్వర్తనులగు సకల యాదవ ప్రముఖ పరివ్రతుండై శ్రీకృష్ణుడు రుక్మిణీ సమేతముగా సుఖంబున నున్నవాడే కదా.

ఉ॥ మిమ్మే కొనియాడుచుందురు తమ్మికంటి సద్ధర్మముదప్పక ॥మి॥ యిమ్మహిలో । నెమ్మదిలో । సమ్మతిమీరగ సర్వజనంబులు ॥మి॥

తే-గీ॥ శ్రీరమేశ ప్రకాశులై మీరుగలుగ । అవని జనులు దురాచారు లౌదు రెట్లు । శక్తిగేవల్లభుడు మెచ్చ రుక్మతేజ । సంతసము మీకు మాకు సశ్శాంతముగను॥

వ॥ దేవా మీకరుణా కటాక్షంబున సర్వజనంబులు మేము సద్వర్తనులమై శ్రీకృష్ణ చరణార విందంబుల మరపు నొందక సుఖంబున నే యున్నవారము మహాప్రభో.

బ॥ భాగవతోత్తము జనంబుల రక్షించి ॥భా॥ యెంచి । పొంచి । మించి । మించి భాగవతో॥ అగమ శాస్త్రంబుల పరిభాగములను జది వించుమి । బాగుగ నిర్జరులు బొగడ । వివేకముల్ యోగమునకు । రాగ ముసంధిల్ల ॥భా॥

సీ॥ వైష్ణవ బృందముల్ వరుసనాశీర్వాద । మునకు రక్షించు బల్ మోద మలర । వేదశాస్త్ర పురాణ విధులొ ధరామర । తతినిందుబిల్వ సద్గతులుదెల్ప । నీతిగాయననాట్య చాతుర్య వతులైన । గంధర్వ సతుల శ్రీఘమునబిల్వ । వందిమాగధుల కానందంబు సంధిల్ల । నీప్సితార్థంబుల నివ్వబంపు । నేను నాయిది యనుచింత మానునట్టి నాదుభక్తుల కతిమేలు పాదుకొల్పు । సర్వజీవుల కిలజన్మ సమ్మతముగ । జీవనోపాయముగజేయ జెప్పవలయు॥

వ॥ మంత్రివర్యా యీ ప్రకారంబుగ నాయనుజ్ఞతో నొనర్చి వారి వారి క్షేమవార్తలు పలుమారు నాకుంజెప్పుచు నామనస్సంతుష్టిం జేయుము.

ఉ॥ భూమిన్ మానాలపురీశ్వర తాముబల్కువిధి యేమరకనువిను ధీమంతుల్ । శ్రీమంతుల్ । ప్రేమతో వచ్చిరి మోదంబున ॥భూ॥

వ॥ స్వామీ మీయాజ్ఞ ప్రకారంబుననే యావజ్జనంబుల నిచ్చటికి రావించి సర్వంబును పరమప్రీతి యొనరించినాడ వీక్షించుడు.

బ॥ సరి మంచిదికాని యొక్క యోచన.

యము॥ అది యెట్టి యోచనయో స్పష్టంబుగా దెల్పుడు.

బలరామ ఉవాచ.

గీ॥ నాదు సుతయగు శశిరేఖ నారిమణికి । యావనప్రాప్తిగలిగెను నివ్వసుధను । పరిణయము జేయవలయు భూసురులు మెచ్చ । లగ్నసామగ్రి జేయించు లక్షణముగ॥

వ॥ అమాత్యవర్యా మత్పుత్రికా రత్నమగు శశిరేఖకు వివాహంబు గావించవలయు గాన వేద విదులగు బ్రాహ్మణోత్తములను రావించి సుదినంబును విచారించి లగ్నసామగ్రి యావత్తు సిద్ధ పరచుము.

ఉ—న॥ అహాహా సర్వేశ్వరా భవదీయ గర్భంబున పుత్రుండు జన్మించక పుత్రికా రత్నం బుదయించుట లోక విరుద్ధంబుగా యున్నది. అదెట్టులన్నను.

సీ॥ బ్రహ్మంబునకు పరబ్రహ్మమై వెలుగొందు । నధిక తేజోమూర్తి వనఘునీవు । విశ్వంబరుడ వీవు విశ్వేశ్వరుడవీవు । విశ్వరూపుడ వీవు శాశ్వతుడవు । పురుషోత్తముడ వాది పురుషుండ వాద్యంత । రహితుండవీవు నారాయణుడవు । కర్మసాక్షివినీవు కర్మకర్తవునీవు । కర్మరక్షకుడవు ఘనుడవీవు । అఖిలలోకను పూజ్యుండవైననీవు । నొరులచే పూజలందక యొరులకెట్లు । పాద ప్రక్షాళనముజేసి బాలనిచ్చి । వందనంబాచరించేటి చందమెటుల॥

దరువు॥ సుగుణా భరణా జగదీశ్వరనీ వగణితముగ నేనెన్నగవశమా తగురీతిని వందనములుమీతో మిగులను గాను ధన్యులుగలరే ॥సు॥ నిను దలచిన వారనుదినమును పాయని దుఃఖము బాసినవారే । నినుపూజించు మనినవారలకె ధనమబ్బును చిత్రముగాదే ॥సు॥ సనకాదులకు నగోచరమగు నీస్వరూపమును గనుటే ఘనము । అనఘునీతో వియ్యమందు భాగ్యముపనుతింపగ నెవ్వరి వశము ॥సు॥ లాలితమా మానాల పురీశ్వర మేలుగల్గు నిన్నదివేడను । వాలాయము నన్నేలుము ప్రొక్కెద నీలీలయు ఘనమదిజూడను॥

వ॥ దేవా నీ యంతరంగంబునం గలుగు యోచన యెట్టిదో నేనెరుంగజాల వక్కాణించి నామన స్థిమితంబు జేయుము స్వామి.

బల—॥ ఓహో మంత్రిశేఖరా నాహృదయ సంకల్పంబు నీ వెరుంగవే వినంజేసెద వినుము.

ఆ-సీ॥ ఋణవిముక్తకు సుగుణయుక్తకుగర్వ। హీనునకునుశాంతి మానసునకు। ధైర్యునకును మరియు దగనన్నదాతకు। పూని వందనంబు లేనొనర్తు।

వ॥ కావున నిట్టి సుగుణములెల్లను పాండుపుత్రుల యందున్నవి గావున అర్జున పుత్రుండగు యభిమన్యునకు నాకూతురు నిచ్చి వివాహంబు గావించ నాకిష్టంబు యున్నది నీవిప్పుడే పండితులైన శ్రోత్రియ పుంగవుల రప్పించుము.

ఉ_వ॥ అహాహా స్వామి మీకిష్టంబు ధర్మయుక్తంబుగా నుండు జరిగి సంతోషించితి సరి యదే నారదులవారు విచ్చేయుచున్నారు వీరి నెల్ల విచారించుడు.

నారదుడు ప్రవేశము — దరువు.

నారాయణం మౌని పారాయణం జనాధారాయణం — భయ నివారాయణం ॥నా॥ ఘోరకలుష సంహారం। శ్రీనారాయణ పదనీరం సూరిజనకులోద్ధారం। సత్యవిచారం। రిపుజనమారం। వీరంనారాయణం॥ మందరాంగ ముచుకుందవరద యరవిందనయన గోవింద జనార్ధనా। నంద యశోదా చందన బ్రహ్మ। నందభరిత మానాల పురీశ్వర ॥నారా॥

సీ॥ దేవనీశ్రీపాద తీర్థంబు త్రైలోక్య। జీవనోపాధి శుభావహంబు। తోర మౌ తత్ ప్రాంత్య తులసీ దళము నిత్య। మంగళప్రదము మందనగ మందు। దనుజారి భవదీయ దర్శనంబిహపర। మోక్షంబు మునిజన రక్షణంబు। హారినీమృదులతర హస్తాభయము మహా। పతితపునర్జన్మ పాదకంబు॥ తే॥ నీముఖాంతర సూక్తులు నిశ్చయముగ। వేదమంత్రంబులని పదివినుతిజేసి। వందనంబాచరింతు నానందమొప్ప। కరుణజూడుము ననుశౌరి ఖలవిదారి॥

వ॥ స్వామీ నీరపాణీ యీ భూభారంబడంచ నుద్భవిల్లిన మీదివ్య మంగళ విగ్రహంబునకు తత్పాదాబ్జంబుల కిదే సాష్టాంగ వందనంబు లాచరింపు చున్నవాడ రక్షింపుము దేవా.

బలదేవ ఉవాచ.

అహాహా యతివరుల సార్వభౌమా మహాత్ములగు మిమ్ము సేవించి

నేనతి ధన్యుండ నైతిని మీ చరణంబుల కిదే ప్రణమిల్లెద యీ రత్న సింహాసనంబున గూర్చుండుము స్వామి.

శా॥ బ్రహ్మజ్ఞాన హృదంతరాల యుతులౌ । పరిజ్ఞాన్వితుల్ మీరలున్
బ్రహ్మేంద్రాదులకైన మీ మహిమలె । న్నన్ శక్యమా నేమదిన్
బ్రహ్మస్త్రీయ సుపుత్రు మిమ్ము నిచటన్ । పాటించి వీక్షించుటన్
బ్రహ్మానందము గల్గె దెల్పగదె దేవా । పాండవుల్ క్షేమమే॥

వ॥ స్వామీ నారద మునీంద్రమా సర్వజ్ఞులగు మీరెరుంగని యర్థ మీ లోకంబున లేదు పాండవేయు లెచ్చట యున్నారో వారివారి క్షేమ వార్త వినగోరు చున్నవాడా వక్కాణింపుము.

నారద ఉవాచ.

వ॥ ఓహో బలదేవా పాండుపుత్రులా ద్వైత వనంబుననుండుట మీరెరింగియే నన్ను విచారించెదరేల వారెల్లరు క్షేమముగానే యున్న వారు గాని మీరు జేయు ప్రయత్నం బెట్టిదో నాకుం దెల్పుడు కర్ణానం దంబుగ వినియెద.

బలదేవ ఉవాచ.

కం॥ పర్జన్యుని తనయుండగు । యర్జునుని కుమారుడైన యభిమన్యు నకున్ । నిర్జరులు మెచ్చ మత్సుత । కూర్జస్వలముగను పెండ్లి యున్ జేయవలెన్॥

వ॥ కావున సుముహూర్తము విచారించి చూడుము.

నారద ఉవాచ.

వ॥ ఓహోహో యదుకులాగ్రగణ్యా! ఇదివరకే యర్జునునకు మన సుభద్ర నిచ్చినదిగాక యింకా యభిమన్యునకు శశిరేఖ నివ్వ దలంచితిరా సరి మీ దివ్యాభిప్రాయంబున కేను మెచ్చితిని.

బలరామ ఉవాచ.

వ॥ ఏననేమి పరమ పుణ్యులగు యప్పాండవులతో వియ్యంబందు భాగ్యంబుకంటె వేరొండు భాగ్యంబుగలదా.

దర్వు—నారద—వాక్యం.

నా॥ సరెసరె నేమెచ్చితి బల్కకట్టి విచారము జేయనిమాటల్ । నరులునవ్వ కార్యము దలపోయుట । పరమ ధర్మమేనీకు । యిత్తరి

మాటేల పరాకు । పరికించిచూడు । పాండవులగోడు । కురువీరుని సమాను
డరయంగ లేడు । అరయంగలేడు । నీకతడౌనుజోడు । సురలైన మెచ్చేరు
చోద్యంబుగా ॥సకి॥

ఆ—గీ॥ కూడుగుడ్డయులేక ఘోరకాననవిభ్రోశేరి । పలువిధంబుల
శ్రమలు బడుచునుండు । పాండవులకు నివ్వ బాలిక యనుచునీ । కంట
కుంభోపాప మంటకున్న॥

వ॥ దేవా సకలైశ్వర్య సంపన్నుడగు దుర్యోధనునితో వియ్యా
బందక కడుబీదలగు పాండవులతో వియ్యంబంద గోరుట బాలిక యనుచు
బుద్ధిహీనుచకేగాని వేరొండులేదు యిట్లొనర్చిన నరులు నవ్వరే నిన్ను
వెర్రిరాములని నిందజేయరే యేల నీకిట్లు స్వల్ప విచారము.

బలరామ ఉవాచ.

వ॥ ఓహో నారదా సర్వజ్ఞుడవయ్యుండియు యిట్లేల బల్కెదవు
స్వల్ప విచారము నాయదిగాదు నీయదియే.

నారదుల వాక్యం.

వ॥ ఇట్లు స్వల్పవిచారము నాదిగాదు నీదే.

దరువు.

బ॥ కలిమిలేము లెన్నగ చీకటియు వెన్నెలల్ । బలిమిని ధృత
రాష్ట్రసుతులు కలహమందు కౌంతేయుల । గెలచి రాజ్యమేలు విధము
కలనైనను గనరెవ్వరు॥

సీ॥ నిత్యసత్యధురీణు డత్యంత పుణ్యుండు । ధరవిశేషుండన ధర్మజుండు ।
జములకు వెరువని సాహస విక్రమంల్ । భీమార్జునులు రణ భీముల
వని । నకుల సహదేవుల కుటిలతదంభోళి । ధరు నెదిర్చియునోర్చు
ధైర్యమతులు । హరియు వారి సహాయుడై యెల్లకార్యంబు । లుర్వి
నిర్వహించుచు నున్నవాడు ॥ యిలను పదమూడు వత్సరంబులును
మించి । నంతకే వారికష్టము లంతమగును । పిమ్మటను వారు గుడుచు
సౌఖ్యమ్ములెన్న । వశమె దుర్యోధనుండెంత వాడుస్వామి॥

వ॥ మహానీశ్వరా యిట్టి ఘనుల నెల్లప్పుడు విడనాడకుండ వలెనని
నామనంబు నిశ్చయించి యున్నవాడ అందులో యభిమన్యుండు మేనల్లుం
డుగదా.

నారదుడు.

వ॥ రేవతీరమణా సుభద్రమీావి ప్రేమ వలనగదా పాండవుల నీవింత పెంపు చేయుచున్నవుగాని దుర్యోధనుండు నీకప్రియుడా దురదుష్టుడా దుర్మార్గుడా దుర్వ్యాచారుడా దుర్బలుండా అట్టి రాజ రాజులం బోలునట్టి ఘనుండీ లోకమున గలడా.

ఉ॥ ద్రోణుడు భీష్ముడుం గృపుడు। ద్రోణునుతుండును కర్ణ శల్యులుం
బ్రాణములా సుయోధనుని। పాలిటియందు నిజాను జన్ముల
క్షీణ పరాక్రముల్ సుతుల। జేయులు వాహిక సోమదత్తులా
స్థాణునకైన యోడరువ। శంబె జయింపగ వారినేరికిన్॥

వ॥ అట్టి అతిరధ మహారధులగు ద్రోణ భీష్మ కృపాశ్వద్ధామ కర్ణాది యోధవీరుల సహాయంబునున్న దుర్యోధనుంగెలువ బ్రహ్మరుద్రేంద్రాదులకైన వశంబుగాదన విందును వారికి దెల్యంబడక పాండవులజ్ఞాత వాసంబు నిర్విఘ్నంబుగా జేయునది యబద్ధము దేవా!

దర్వు.

నా॥ యెన్నగవశమేసుయోధ నోన్నత బలముగ్। యున్నత బల ముగా। కానున్నత విజయమున యున్నత ఘనులతనితోడు విన్నగు భయముగ్॥

సీ॥ వజ్రశరీరుండు వజ్రవిహారుండు। రణపుణ్యాలుడిల రణవిజయుడు।
కరమునందునదివ్య పరశువేదియుగల్గి। సకల ధర్మములందు ప్రకట
మయ్యె। నవఖండ పృధివేలు నాయకుండతడౌగా। కౌరులు నాతని
నోంప యోర్వగలరె। వైభవంబులకెల్ల వజ్రసమానుండు। ధనదుని
మించిన ధనికుడరయ॥ పాండవులయందు శ్రీహరియుండివారి। కిచ్చి
నదియేమి యాతని కివనిదేమి। సర్వజీవులు వారికొక్క సమముగారె।
తెలిసి పలుమారు నీవిట్లు బలుకుటేల॥

వ॥ ఇట్టి ఘనునితో వియ్యమందునంత భాగ్యంబున్నదే పాండవులు మేనవాండ్రయి ప్రియంబు జేసినదేమి యా రారాజు నీకప్రియంబు జేసినదేమి వక్కాణింపుము.

బ॥ పాపాత్ముడుగాడె కురుపతి। దలువంగవశమె ॥పా॥ రూపింపగ

వానిజూడ జూపరులకు రోషమబ్బు । ద్రోపదు సంతోషమతనితో వియ్యము
నల్పునెల్ల ॥పా॥

సీ॥ పరస్త్రీల తనమాత్ర భావాన జూడని । కామాంధ కారుడు ఖల
మతుడు । పరద్రవ్యము లాశించ నొరుడు నెల్లప్పు । ఇతరుల క్షేమము
జూచి యోర్వలేడు । బహాత్ములైయు సుబుద్ధి లేదితైన । పరులదూ
షించును పాపమరక । పరము పుణ్యాత్ములౌ పాండు పుత్రుల కెప్పు ।
డహితంబు జేయు నయ్యధము నెట్లు ॥ మెచ్చ దగును కీర్తి వచ్చు నెట్టు
లనిన । అధికునింట దాసి యగుటమేలు । అధమునింట సాని యైయున్న
ఫలమేమి । దీనికొప్పసుమ్మి మౌనివర్య॥

వ॥ యతీశ్వరా ! దుర్యోధనుండెంత ఘనుండయినను పరమపాపా
త్ముడుగదా అట్టి పాపాత్మునితో వియ్యమొంద నాకిష్టంబులేదు వెయ్యేల
బలికెదను యీరొక్కనుడు.

నారదుడు తనలో

వ॥ ఇదంతయు నిశ్చయమే కాని కలహంబిది యన్నంబు నాకెట్లు
ప్రాప్తించును కానికాని యింకొక్కమాట బల్కెద (అని ప్రకాశముగా)
స్వామీ హాలప్రియా అయ్యయ్యో యెంతమాట బల్కితివి.

దరువు.

నా॥ యెంతమాట బల్కితి విసుమంతయును సహింపరాని ॥యెం॥
కంతుజనకుడదియు మెచ్చ గలడె ధర్మమార్గమగునె ॥యెం॥ పంతము లేల
సుయోధనుడు తా పాపాత్ముండగు నెటుల । ధీమంతుడవై నీవిటుల యీ
వింతలు బల్కిన విందురె సుజనులు ॥యెం॥

వ॥ స్వామీ ! యాదవకులాగ్రణీ సర్వజ్ఞుండవై యుండి నీవిటులజ్ఞా
నోక్తులు బల్కంజెల్లదు నామాట వినుము.

కం॥ పగతుర జెరచితి రనియును । పగతురచే జెడితిననియు ।
బాలుడు దలచుర్ । పగచెలుములు లేవాత్మకు । పగచెలుములు కీలుకర్మ
బంధము నుండీ॥

వ॥ తానుజేయు పూర్వకర్మంబులు తన్ను జెరచుచున్నవి గాని
వేరొండు వాక్యము లేదు దుర్యోధనుండు పాపాత్ముడై యున్నను మహా
త్ములగు భీష్మద్రోణ కృపాశ్వత్థామ కర్ణాది యోధవీరు లాతని సహా

యులై యుండురెట్లు పాపాత్ముడైన వానికి చక్రవర్తిత్వాధికారంబు నిల్పబెట్లు హాస్తంబున పరశువేది యుండునట్లు అదియునుంగాక ధర్మ జుండొక్కనాడైన తననోట దుర్యోధనుండు పాపాత్ముండన విందుమా యిపంతయు నీవె బాగా యోచించి పల్కుము దుర్యోధనుండు పాపా త్ముండు గాడు.

బలరామ ఉవాచ॥ వ॥ అహహా యతికుల సార్వభౌమా మీారను వాక్యంబుల కేను సంతసించితిని గాని.

ఋ॥ నామనవివిను మనవివినూ । మానుగనునా సామార్దుడుకృష్ణ స్వామినిదీని విచారముచేయవలెన । వలెనూ యిలనూ కామితఫలదుండా । మహాత్ముడు॥

గీ॥ సర్వలోకశరణ్యుండుసరసిజాక్షు । డట్టిశౌరికిదెల్యక నెట్టికార్య। మిలను యత్నించి జేయంగవలదుగాన । తెలియజేసినకార్యంబుఫలితమౌను॥

వ॥ కావున అట్టి కృష్ణపరంధాముని విచారించెద.

నారదుడు తనలో.

వ॥ ఓహోహో యిట్టివార్త యమ్మహాత్ముని కెరిగించిన నేజేయు యత్నంబంతయు వ్యర్థంబగుచున్నది గోప్యంబుగ జేయించవలయుం గాన దీనికొక్క యుపాయంబు బన్నెద (అని ప్రకాశముగా) ఓహో బలదేవా యాపరమాత్ముడీలోకంబులో జేయు కార్యములలో నొక్కటియైనమెచ్చి నడాయిక్కార్యంబును మెచ్చగలడా కృష్ణుండుత్కృష్ణుండే నాకుం దెలుసును.

బలరాములు

వ॥ యేమి నారదా యప్పరమాత్ముని కిష్టంబుగాని కార్యంబీలో కంబుల యెవ్వారేనియుంజేసి యొక్కక్షణంబైన జీవింపగలరా.

నారదులు-వ॥ అదంతయు జెప్పెదవినుము.

సీ॥ దారాసుతభ్రమదగిలివర్తించెటి । వానిమెచ్చడు యొక్కవరుస నైన ధనధాన్యములకూర్చి దానమిచ్చినయట్టి। వానిమెచ్చడుయొక్క వరు సనైన । ఖ్యాతిలాభార్థనకాంక్షలుగలయట్టి । వానిమెచ్చడుయొక్క వరుసనైన। దేహసౌఖ్యములకు మోహించియున్నట్టి । వానిమెచ్చడు యొక్క వరుసనైన॥ యెట్టిసుఖములుగోరక యెల్లయెడల । మోక్ష

మును గోరువానికే ముఖ్యుడనియె । మోక్షమునుగోరు చున్నట్టిమును
లసౌఖ్య । సంసారసుఖములనదియెల్ల వినవేకనవె॥

వ॥ అట్టికౌరవిమెప్పించునవి సన్యాసిగుణంబులేకాని సంసారగుణంబులు మెప్పించవు కావున వారివిచారించి చేయునది ఫలంబుగాదు అదెట్లన్నను.

దక్వా—వా। వాసిగాంచినవారు పాండవులు బూనియుండిరే సుఖము మరచానిలోంది కేజమును । సుజ్ఞానుడవివిటువినుము । హేభానుసమాన సుఖద్రినిచ్చినడే హీనము మానము ॥వా॥ పిమ్మట సౌఖ్యములనుభవ మయ్యెది నెమ్మదిలోదెల్పుమమె । నెపుడిష్మహిబ్రతుకుటనిజమే । పర సామ్మ దేహమునవిడమె । విజయమ్ముల విజయమంలిమ్మగ స్వాధీనమ్మన వచ్చునెవానీ। పుత్రియు శ్రమకోపక ముందు నీపై మిడుకునుగాదె। పాపము తాపముగాదె । నీవాదనిదలుపగరాదె ॥యా॥ గోపాలుడు మదికోపగించిన సరె పలుమరుయిక ॥పా॥ యేలవిచారము చాలుచాలుమానాల పురీశ్వర నేడుకరుణాలవాలకృపజూడు । యిదిమేలౌనుమినీతోడు । గుణజాలనాదు వాక్జాలములెల్లను పేలవమనకుమి ॥వా॥

వ॥ స్వామీ క్షీరపాణీ నేబల్కినట్టి వాక్యంబులెల్లను సత్యమో అసత్యమో యోచించి చూడుము.

బలరామ ఉవాచ:— వ॥ సరి మంచిది.

ఉ॥ ఏరికినందరాని కమలేశకళాన్వితులైన మీదువా
గ్మిరగరాదు యెల్లపుడు మీరినవానికి శోభనంబులున్
జేరని దోషపుంజములు జెందక సర్వసుఖాన్వితుండునౌ
కౌరవరాజపుత్రునికి గ్రక్కున మత్సుత నిత్తువేగముఖ॥

వ॥ స్వామీ ! మానీశ్వరా బ్రహ్మవాదులను మీవాక్యములం దప్పక దుర్యోధను పుత్రుడగు లక్ష్మణునకే మత్కన్యారత్నంబగు శశిరేఖ నిచ్చెద నమ్ముడు.

నారదుడు—వ॥ సరి మంచిది నీవిప్పుడే సుయోధనునకు శుభలేఖ వ్రాసిపంపుము నేనిదే సత్యలోకంబున కేగుచున్నవాడ.

బలరాములు.

వ॥ చిత్తము మహాత్మా ! అని యుద్ధవుపంకజూచి యుద్ధవా యిట్టి మహాత్ములవాక్యంబులు వృథాజేయముఖ్యంబుగాదు సుయోధనునకు శుభలేఖ వ్రాసి విప్రోత్తములచే బంపుము.

ఉ-వ॥ స్వామీ ! అట్టులనే వ్రాయువాడ కటాక్షింపుడు.

శుభలేక.

సీ॥ శ్రీమంతుడైన రాజశ్రీసుయోధన । చక్రవర్తికి మహా సన్నుతముగ
యదుకులాన్వయ చంద్రుడౌ బలభద్రుండు । వ్రాయించు శుభలేఖ
వరుస వినియు । నీసుపుత్రునకును నానుత నివ్వంగ । దలచితి గాన
మోదమునమీరు । శుభ ముహూర్తమును భూసురుల విచారించి ।
రావలెమీరు గౌరవము మెరయ । వలవదాలస్యమును వధూ వరుల
కిపుడె । లగ్నబలము సమీపించె లక్షణముగ । మీతో వియ్యము
సల్పంగ ప్రీతిగల్గె । రాజరాజే ద్ర కురుకుల రాజచంద్రా॥

ఉ-వ॥ సేవకా యిదే శుభపత్రిక విప్రోత్తముల కొసంగి దుర్యో
ధను కడకుం దోలుము.

వ॥ చిత్తము ప్రభో (అని శుభలేఖ బ్రాహ్మణులకిచ్చి హస్తినా
పురంబునకు దోలుదురు.

శశిరేఖా ప్రవేశము—దరువు.

శశిరేఖనేకొమ్మ దశరేఖనై వెలుంగునే ॥శశి॥ నిశిపతి షోడశకళల
సదృశమై వెలుగొందుచుధర । దశదిశలను కీర్తిదమై । దనరిన ముద్భరి
తను ॥శశి॥ కామినీమణిని బలరాముని ప్రియాత్మజనా ॥కా॥ సోమవదను
డైన రామ సోదరుడౌ కృష్ణదేవు । డీమహి నాపిన్నతండ్రి । కామితఫల
ప్రదుడు ॥శశి॥ రేవతి జననీ । ప్రజ్ఞా విలాసినియూసతి ॥రే॥ హావభావ లలి
తాంగి మాయత్త సుభద్రయు రణజయు । కోదండు నాదుమామ భూ
వరుడర్జునుడే ॥శశి॥ యేలును దయతో । మానాల పారివానునర ॥నే॥
బాలామణులగూడి యాటపాటలు సల్పచు మరునీ । కోలలకోర్వక వరు
నిగా । గోరియు నరుదెంచితి ॥శశి॥

వ॥ సఖి చంద్రముఖీ.

చె-వ॥ అమ్మా శశిరేఖా యేమియాజ్ఞ.

శశిరేఖ.

సీ॥ నాజనకుండిల ననుగన్న మాత్రమే । జవ్వనినై యుండు నరకొరుగడొ
తరుణినానునుగను పురుషుడెచ్చట లేడొ । పరిణయంబునకు లగ్న
బలము లేదొ । పాతులే రాచకొమారుని గనబోయి । తడసిరాయున్నదొ

వృషమింగ్లోన । సర్వేశుడై నమస్కార మన్యులకెట్లు । యొనరింతువని మాసి యున్నదేమొ । యెట్టికారణ మొకొ్ ీవట్టివార్త । లెల్లయే మైన దెలిసున్న యెరుగబల్కు । బాలయెన్నాళ్ళ నేనిట్లుజాలిపడుచు । మరుని బారికి నేనోర్తు సరసిజాక్షి॥

వ॥ నెచ్చెలీ మజ్జనకుండు నన్ను గన్నదుగాని వివాహంబు గావించ కున్నడు కారణంబేమొ అట్టివార్త నీవేమైన ఎరుంగుదువా వక్కాణించుము.

చెలియ వాక్యము.

వ॥ బాలికామణి నేనట్టి వార్తన్య మెంతమాత్ర మెరుంగ కున్న దాన పిమ్మట నేనంతయున్నరింగి నీకుం దెలిపెద గాని కొంతతడవు తాళి యుండుము.

శశి — దరువు.

తరుణిరో మరులాయెనె తాళజాలను । మరుడు పుష్పశర వరంపరల మఃరింతయు లేక యురమున । గురియసాగెనె ॥త॥ చల్లగాలియు వీచెనే మది తల్లడిల్లెనె ॥చ॥ మొల్లగంధిరో పాపిచందు్రిడల్ల నన్ను గనితా నెల్లకళల వహించెనే ॥త॥ మగువరో తనువెల్ల జూడ గగురుపాడిచెగదె । పగలు రాత్రి నిదురలేకా వగలకానిక్కై మనసులో । వగవ నాయెగదె తరుణిరో మరులా ॥త॥ గోలరో నాప్రియుని దేవే కోపమేలనె ॥గో॥ శీలుడా మానాల పోరి నీలవర్ణు డెంతోనీకు । మేలొసంగుగదె ॥తరు॥

వ॥ సఖీమణీ నేనెంత వేడినను నాపై కరుణింతలేక యున్నది యిది న్యాయమా.

చెలియ — దరువు.

ఇంతీ మరులేర ॥వో॥ యింతీ చామంతీ పూబంతీ పూబంతీ ॥యి॥ యిందువదన మందగమన తొందరేలనె । చాన మదిలోన భ్రమబూనా । మేలానా ॥యిం॥ ఆచక మదినీ చలంబు తోచనీవన లె ॥తి॥ యీచలమా నీచుల మారాజకులము కిదన్యాయమె॥యిం॥ నా సిగమానాల పోరితుజేలు నేవారి । నాతీ వొయ్యారి సుకుమారి అలాసారి॥యింతీ॥

వ॥ తల్లీ నీ వెంతమాత్రము ధావంతపడకుము వివాహంబైన పిమ్మట నీకోర్కె సిద్ధించగలదు తాళుతాళుము.

శశి-వ॥ చెలీ నీ వెంత బుజ్జగించినను నామానసంబు నిమిషమాత్రము నిలుపకున్నది గదా.

ఉ॥ కోకిల రావముల్ చిలుక । గూఫులు పల్కులు చల్లగాలియున్
రాక సుధాంశు మేల్కళలు । రంజిల తుమ్మెద నిండుగీతముల్
వ్యాకుల మొందఁ జేయనిదు । రందున చిత్రము లైన స్వప్నముల్
నాకు గనంబడెన్ వినవె । నారిమిఠారి యికేమి జెప్పుదున్॥

వ॥ తరుణీ నామనంబున నిట్టులుండ నీమోహా తాపంబు నిక నేనె ట్టుల భరింప గలదాన.

సఖిమణి వాక్యం- వ॥ ఓహో బాలికామణి నీ వెంతమాత్రం మదన తాపంబు భరింపకున్నదానవు కొంతప్రొద్దు వన విహారము జేతము నీ తండ్రి సెలవుగొని రమ్మి పో పొమ్ము.

శశి-వ॥ సరి మంచిది నీవన్నట్టులనే మజ్జనకునాజ్ఞగొని వచ్చెద నీ విచ్చటనే యుండుము.

సఖివాక్యం-వ॥ శీఘ్రంబుగ రమ్మి పో పొమ్ము.

యాదవసభ:-

శశి-వ॥ యదుకుల తిలకా కరుణించు దేవా । దేవా బ్రోవా । కానలేవా ॥య॥ సంధియమును లేదను నాడెందము నానందముగా । వంద నములు వందనములు ॥యదు॥ కోవిదాగ్రణి వినుత దేవతాగ్రణి । భావ మునందునన్ నిను ప్రస్తుతించెదన్ ॥య॥ నావిభుడవనీ మానాలవతి వనీ । భావింతున్ శేవి తున్ । దేవదేవనిన్ ॥య॥

శా॥ ఎన్నో జన్మము లెత్తి ప్రీతిమెయియము । న్నేజన్మ మందైననున్
ఛెన్నొందన్ గను భాగ్య మెవ్వరిలలో । జెందంగ లేరైరిభల్
విన్నా నెంబగు నీదుగర్భముననా । విర్భూతనై యుంట న
న్నన్నంగన్ దరమే పితా మహునకున్ । యీనాడె భాగ్యంబిలన్॥

వ॥ తండ్రి సర్వలోక శరణ్యులైనను మీగర్భంబున నుద్భవించిన నా భాగ్యం బెంతనవచ్చును. మిమ్ము సేవించి నేటికి సంతోషించితి మీ కిదే పాదనంబు లాచరించుచున్నదాన కటాక్షించుము దేవా.

బల—వ॥ ఆహాహా సంతోషము సంతోషము.

దరువు.

రమ్మురమ్మ బాలిక రమ్ము కుటిలాలక । సమ్మానించితి నీవాక్యము పరమానందిక ॥ర॥ అమ్మాయి నీకేమి అపేక్ష గల్గెను । తెచ్చియన్న తెప్పింతు యిమ్మన్న నిప్పింతు ॥రమ్ము॥

సీ॥ చూత ఫలంబులో సీతా ఫలంబులో । ఖర్జూర ఫలములో కంబుకంఠి అరటి పండులో మంచివౌ ద్రాక్ష ఫలములో । శర్కరా పూపర సంబులో కొ । చిత్తరు బొమ్మలో క్రొత్త పూబొమ్మలో । చిత్రాంబరంబులో మిత్రిసతులో । వలసిన భూషణాదులో సత్పరిమళ । గంధంబులో మేలు కందుకములో । ఇందులో నెట్టి వస్తువు లందునీకు ప్రీతి గలదో వచింపుము ప్రేమతోడ । శీఘ్రమున నీకు దెప్పించి చేతి కిత్తు । తల్లి వీవె గుణవతీమ తల్లి వీవె॥

వ॥ బాలికా నేజెప్పు ఫలంబులలో నీకిష్టం బెవ్వియో వక్కాణింపుము. నే దెప్పించువాడ.

దరువు॥ నన్ను గన్న తండ్రి నా మూలధనమ । కన్నులార నిన్ను గన్న మోదమాయె ॥నన్ను॥

సీ॥ భాగ్యశాలికిజూడ ఫలము లెన్నియునున్న । పతి ఫలంబుకన్న ఫలము గలదె । పైభూషణము లెన్ని పడతికి గలిగున్న । పతిభూషణముకన్న ఫలము గలదె । బంధువు లెందరు పతివ్రతాంగనకున్న । పతిబాంధవముకన్న ఫలము గలదె । సఖు లెందరున్నను సరిసీగు హాస్యేకి । పతి సుఖత్వముకన్న ఫలముగలదె । అన్నిటికి మూల మాత్మేశు డనెడి ఫలము । అట్టి పతి ఫలమ్మును గోరుచుట్టి సతికి । కరతలామలకముగాదె పరమపదవి । నీకు దెల్పనిదేది సుశ్లోక చరితా॥

వ॥ అట్టి పతిఫలంబుగాక వేరొండెద్దియు గోరుచుదిలేదు గావున వివాహంబు గావించుటయే కర్తవ్యము.

బలభద్ర ఉవాచ.

వ॥ ఆహాహా యదుద్భవా నా పుత్రికా రత్నంబు సుగుణంబు లెంతన వచ్చును యెంత భాగ్యంబున్నను పుత్రికా భాగ్యంబుతో సమంబు రాదు గదా.

ఉ-వ॥ దేవా భక్తజన కామధేనువా నిన్ను స్మరించినవారలే సద్గుణైశ్వర్య సంపన్నులగుదురని విందును కాన తమ గర్భంబున జన్మించిన పుణ్యాత్ములు సద్గుణులుగాక యుందురా మీ సాత్విక గుణంబుల కెల్ల వందనంబు లొనరించెద స్వామీ.

బ-వ॥ బాలికా నీ మృదు మధురోక్తులకేను సంతోషించినాడ గాని

వాదం.

బ॥ ఇంతి నీవివాహమేను । యిదె సమయము గావించెద ॥ఇం॥ కాంతునిగా యెవ్వని నీమంతనమున గోరితివా। వంతదెల్పువానిని గావింతు నీమనోహరునిగ ॥యిం॥

గీ॥ మత్స్యయంత్రమేసి మహిత కీర్తిగాంచు। రాజవరుల నిటకు రాబిలతున । రమణతో స్వయం వరంబు సాటింతున । తల్లి నీయభీష్ట మెల్ల జెపుమ॥

వ॥ పుత్రికారత్నమా నీకిష్టంబెద్దియో స్పష్టంబుగా నీ చిల్కపల్కులం బల్కుము తత్కార్యంబు నెరవేర్చెద.

శశి॥ దానవారి మీయాజ్ఞ ॥దా॥ మానసమున మానజాల ॥దా॥ గానలోల మీకిష్టముగానివాని నేనొల్లను। నేను నాయదను భ్రాంతులు బూనజాల చాలునయ్య ॥దా॥

సీ॥ జనయిత్రిజనకులు సాకారబ్రహ్మస్వ। రూపులై యిలతన కాపుగలుగ। వారియిష్టంబులవారించు దుర్బుద్ధు। లున్ననుదగునె ప్రసన్నవృత్తి। అది గాక నీధర మాడుదానను నాకు। తగునయ్యయిట్టి స్వతంత్రబుద్ధి। భగవత్స్వరూపులై బరగుమీ రెట్టుల। వర్తించుమన్న నేనొర్తుగాని। మిమ్ము కాదనియొండు వాక్యమ్ము బలుక। మీయనుజ్ఞయుదాట నన్యాయమతిని। మీకుయిష్టంబయగువాని నాకుపతిని। చేయుమిక నాకిదే మంచి క్షేమమయ్య॥

వ॥ తండ్రీ మీయిష్టంబునకు నే వర్తించునది సత్పుత్త్రి వృత్తిగాని స్వతంత్రింబు జెలదు కావున మీయిష్టము సందేహించకుము.

బలరామ ఉవాచ—వ॥ ఆహాహా ముద్దుపుత్త్రీరత్నమా నీపలుకు లెల్ల నామనంబునకు అమృతసారంబులై చిలుకుచున్నవిగదా.

బ॥ బాలామణీలాలీలా ॥వా॥ శోభిల్లనీవింతవచ్చెనా ॥బా॥ మేలుగ నింతనవచ్చెనా ॥బా॥ మేలగు మేనకనీ వాగ్జాలములా వేదోక్తులబోలి యుండె నామది గుణజాల చాలమోదమయ్యె॥

ఉ॥ నారిలలామనీవిధము । నన్ భజియించు మహాత్ములెల్ల సం
సారవిముక్తులయ్యెకలు । షంబులబాసియు నాదియోగులన్
జేరిసుఖించుతత్పదవి । జెంది సుఖింతురుగాక నన్ను సొం
పార భజింపనట్టి మహా । పాపిజనుల్ శ్రమజెందకుందురే॥

వ॥ బాలికామణి నన్నుభజించుచున్న నీవంటి ప్రపన్నులకెల్ల సౌఖ్యంబు లొనగూర్చుటకె యేకదా నేనవతరించినది సరిమంచిది నీయిష్టంబగు పురుషుండే నీకుభర్తగా గూర్చెద నమ్ముము

శశి॥ ఏల మెచ్చుచేసెదరు త ॥ఏ॥ శీలమొనగ బాలనునే ॥ఏ॥ లాలిత మా మీగుణజాలము లెన్నగజాలని । గోలనునను మనుచుమిమానాల పురీశ్వర యీశ్వర.

వ॥ తండ్రీ అజ్ఞానురాలనగు నన్నింత మెచ్చుజేసెదరేల మీకిదే నమస్కరించెద కటాక్షించుడు.

బలరామ ఉవాచ—ఉద్ధవునితో.

వ॥ ఆహాహా యుద్ధవా యిట్టి కన్యారత్నమునకు సుయోధన పుత్త్రుండు తగినపురుషుండగునా యోచింపవలెను.

ఉద్ధవుడు—వ॥ దేవా జనార్దనాగ్రజా నీవా దుర్యోధనుతో వియ్యంబందనది నిశ్చయమా? యేమో.

బలరామ ఉవాచ.

వ॥ ఏమీ మంత్రివర్యా నీవేమో సందేహముగా బలుకుచున్నావె తే ఇందు కేవ్వారైన కార్యవిఘాత కెత్తింపియుండిరా స్పష్టంబుగా బలుకుము.

శశి—వ॥ తండ్రీ అదంతట్లుండనిమ్ము వొకమనవి.

బల—వ॥ బాలకీ ఆదేట్టి మనవి.

వాదం – వనముజూడకాంక్ష గల్గెననుచు వేదయక । జననియాజ్ఞ గొనివచ్చితి జనకనీవికనాజ్ఞయిమ్మా । పరిచారికలనుగూడియు । పనివిని యెద కొంతపొద్దు ॥వనము॥

వ॥ జనకా మన యుద్యాన వనము జూడ నామది గోరుచున్నది సెలవొసంగుము నేబోయి మరల శీఘ్రమున వచ్చెద.

బ॥ తల్లి నీవిటుల గోరజెల్లదేమదిక ॥త॥ మొల్లగంధి రాణి వాసమునను సౌఖ్యముగనుండక । యెల్లమృగములున్న చోటికేగిచరించుట వలదె ॥త॥

వ॥ తల్లీ నీవతిసుకుమారివి ఘోరమృగములున్న చోటి కరుగ వలదు అంతఃపురమున సుఖమున నుండుమమ్మా.

శశి॥ మీకటాక్షమున్న జాలునాకు మేలగుక । లోకనాయకుడవునీవే లోకలోచనుడవునీవె సాకల్యముమిమ్మెన్నగజాలరు బ్రహ్మేంద్రాలు ॥ మీ

వ॥ తండ్రీ సర్వవ్యాపకులగు మీకటాక్షమున్న నాకెందుబోయిన భయములేదు గాన సందేహించక పలుకుము.

బ॥ ఇంతీనీవిటులనమది కేమితోచదే । కాంతలునిజగృహమువిడచి కాననమునచరియించుట । దంతియానయదియు రాచధర్మముగాదనవిందును॥

వ॥ నాముద్దు రత్నమా నీవిట్లు బలుకుచున్న మనమున కెటుదోచను న్నది యాడువారలు నిజగృహమువిడచి వనముచరించ రాచధర్మముగాదు.

శ॥ వీలగు శృంగారవనము వేయు కారణము। బాలుర కెల్లను కందుక కేళికోసరంబుగాదె । నీలవసననీవిటులనబోలునేన్యాయము యీధర ॥

వ॥ మీవంటి ధర్మప్రభువులు శృంగార వనములు వేయునది మా వంటిబాలురు చరించి పొద్దుపుచ్చుటకేగదా తెలిసియుండి యిటులబల్క న్యాయమా.

బ॥ ఎంతజెప్పినను వినవికయేమి సేతునే । కాంతరోమానాలవారి కంతుజనకుడేలునునీ । వింతలోనటుబోయిరమ్మా । వేవేగను తడవుండక॥

వ॥ తల్లీ నీవిప్పుడే సమానవయస్కులంగూడి వనవిహారంబుసల్పి శీఘ్రంబున రమ్మా యాలస్యంబు వలదు.

శశి–వ॥ తండ్రీ మీరన్నటులనే శీఘ్రంబున పోయివచ్చెద చింత చేయకుము.

బల—వ॥ సరి వెళ్ళుము. (అని నిష్క్రమింతురు)

శశి—చెలులసంక జూచి—వ॥ నెచ్చెలీ నీవొకసారి యిటురమ్మా.

చె—వ॥ అమ్మా శశిరేఖా యేమి విచారము మీతండ్రిగారి సెలవు గొనివచ్చితివా లేదా?

వాడం—శశి॥ వనవిహారమున కల్పబోదము వారిజాక్షిరో రాగదే। జనకునాజ్ఞ వహించి తిని సజ్జనులు మెచ్చినత్రోవిదే ॥వన॥

వ॥ సఖి నీవన్నటులనే జనకునాజ్ఞగొని వచ్చినదానను శృంగార వనంబున కేమార్గమో పోదము రమ్మా.

చె॥ నారీమణి రారమ్మిటు శృంగారవన బిదె। చారుతర వృక్షములుగల విస్తార కన్నులగను మిదె॥

వ॥ అమ్మా శశిరేఖా వనము బోవుమార్గమే వనమార్గము సమీపంబునను వస్తిమి చిత్రవిచిత్రంబులగు వృక్షములున్నవి యిదే వీక్షింపుము.

శశి—వ॥ అహాహా సఖీమణీ యిదెంత విచిత్రము.

దర్వు—శశి॥ మల్లెమొల్లలు గోటమా క్రొమ్మెడించగ దాల్తమా॥ చల్లగాలియు వీవ సొక్కుచు పల్లవాస్త్రుని గొల్తమా॥

వ॥ సోదరీ నీవిదే మల్లెపుష్పంబులనెల్ల మత్సఖారత్నంబునం ధరింపుము సంతోషించెద.

శ॥ కీరవాణిరో చూడవే సరసీరుహంబుల నీవిటు కేరుతుమ్మెద పిండుజుమ్మను గీతముల సరిలేవెటు.

వ॥ సుందరీరత్నమా నీవిదేకమలాకరంబుల జూచితివా తుమ్మెద సమూహంబెల్లను తత్పలరసంబు గ్రోలుచు మనోహరంబుగా జుమ్మని మ్రోతలిడుచున్నవి గదా.

శశి—వ॥ సరి బాగానున్నది.

శ॥ శారికా కోవెలలు గూయగ సంతసించెనే నామదీ। యేరికెన్నగ వశముగాదిది యెంతచిత్రమును నున్నదీ॥

వ॥ అమ్మా భగినీ యిదే చిలుకలు కోవెలలు పల్కుచున్నవి వింటివా తద్రవంబునను నామనంబతి సంతోషించుచున్నది గదా.

చె॥ యింతిరో మానాలపురి శ్రీకాంతు నిజవాసంబిదీ। దంతివరదుని కివ్వనాంతరమున కెంతో సౌఖ్యంబె వద॥యిం॥

వ॥ అమ్మా యీవనాంతరంబు శ్రీహరియే సృజించెను గాని పితామహుండు సృజించలేదు వీనిఁ జర్చించ ఇంద్రాదుల కశక్యమై యున్నది నేనేమి చెప్పెదు.

శశి—వ॥ సత్యము సత్యము సహోదరి యింకా యీవనవృక్షంబులు నానావిధంబులుగా నున్నవి వీటి నామంబులం జెప్పెద వినుము.

సీ॥ మందారమకరంద మాధుర్య సముతె। యిందీవరాక్షి నీవిదుగో చూడు
చంపకపున్నాగసంపెంగ తరువులె। చందన గంధి నీవంది చూడు। సాల
రసార విశాలామలకములె। నీలజీమూతవేణిదుగో చూడు। కర్పూర
కుంకుమాగరు వాసనలు నివే। మల్లికా వృక్షల్ మగువచూడు॥ కుంద
కుట్మలములు నివే కుందరదన। కోకిల స్వరముల జూడు మాకసమున।
రాజహంసల నిదో చూడు రాజవదన। శారికాకీరములజూడు చంచ
లాక్షి॥

వ॥ చంద్రముఖి యిట్టి వనాంతరంబు రాత్రింబగళ్ళు వీక్షింపుచున్నను పేరుదీరకున్నది నిందొక్క క్షణంబు విశ్రమింప వలయును.

చంద్రి—వ॥ అమ్మా బాలికా నీవన్నట్టులనే కొంత ప్రొద్దు విహారింతము గాని యొక మనవి.

ఉ॥ ఇందుని భాననా వినవె। యేనొకటిందు వచింతు నిప్పుడీ
చందన వృక్షరాజమున। చల్లని నీడల గొంత ప్రొద్దు మే
ల్కొందుక కేళి సల్పుటకు। కామిని నామది గోరి యుంటిగా
సందియ మీవు జేయకను। సంతస మొందియు రమ్మువేగముగ॥

వ॥ సుందరీమణీ మన మీ చందన వృక్షంబు క్రిందను కొంత తడవు పూబంతు లాడుకొందము రమ్మా.

శశి—వ॥ సరి మంచిదట్టులనే యొనరము బంతులం దెమ్మా.

వాదం॥ చం॥ అంబుజాక్షి [illegible]। కంబు కంధరి నాదు పల్కులు। కాదనకు మికఁ [illegible]

వ॥ సఖి ఎణి యీ యాటలందు నామాటలు ఖ్యాటకంబు లనవు గదా యటులైన నేనొప్పను. [illegible]

చః—వ॥ అమ్మా శశిరేఖా మనమెల్ల అన్యోన్యాను రాగంబున కూడియున్న వారము అట్లుండక వెంటనేనిదే పూబంతులగొని తెచ్చితి గనుగొనుము.

ఇందువదన మందగమన। కందుకంబు లిదొసఖి। యందుకొనవె వేసెదను యానంద మొందుచును సఖి॥

వ॥ యేమియీబాలికా యాడగానిదానివతు బంతులుదప్పి విడిచెదవేల.

శశి—వ॥ చెలీ నేనీ యాటాడక చాలాకాలము జరిగెను కావున మరచినట్లున్నది. యీ యాటిట్లుండనిమ్ము.

శశి॥ ఇత్తెరంగు చాలు నింకొక నృత్త మాడుదమే సఖి। హస్తు గూడి చౌట లాడుదమెత్తి హస్తములూ సఖి॥

వ॥ మనమెల్లను రెండు రంగముల వారమైయుండి చౌట లాడు కొందము రండు యీ యాట నాకతిప్రియంబై యున్నది.

చంద్రి—వ॥ సోదరీ శశిరేఖా యీయాట నాకిష్టము లేదు నేనొక్కటి జెప్పెద వినుము.

చం॥ నీతితో మనమింక దాగుడుమూత లాడుదమే సతీ। ప్రీతితో నీకిత్తు సుమ్మా చూతఫలములిదో సతీ ॥నీతి॥

వ॥ శశిరేఖా మనమిదే మహా సొంపగు దాగుడుమూత లాడుదము రమ్మా నీకిదే తియ్యని చూతఫలము లిచ్చెద.

శశి—వ॥ సరి యువిట్లుండనిమ్మా గాని.

శశి॥ చిలుకలు కోవెలలు తరువున బల్కుచున్నవదో సఖి। అలరు విల్తుని సుమశరము లాతులు జెందెదమీదికి ॥చి॥

వ॥ సఖిమణి యిదో యావృక్షము పైనుండి చిలుకపలుకులుకోవెల కూతలునా మనమునకు సంభ్రమముగా నున్నవి మదన తాపం బంకురించెగదే యిక నేనేమి సేయుదాన.

చ॥ బాలనీవా జోలి మరువుము వేళగాదిపుడూ సతి। గోలరో మా వాల వురిహరి మేలొసగు నీకుసతి॥

వ॥ హే కాంతామణి నీవింతమాత్ర మాదెస చిత్తముంచవలదు నేనొక యుచ్చట జెప్పెద రమ్మా.

శశి—వ॥ హా సుందరీమణీ నీ వెన్ని బల్కినను నామనంబు

క్షణమాత్రమైన మదనతాపము భరింపజాలకున్నది నేటి రాత్రియెట్లు వెళ్ళునోకదా.

చంద్రి వ॥ అమ్మా యిదేమి మూర్ఖత నీవలె జవ్వనులము మేము గామా మానమంబు నిల్పుటెట్లు నిల్వకుండుటెట్లు.

తనలో—శశి—దర్వు.

మదన శౌరవదనా ఔరమదనా నీకదనా మోర్చదరా సదనము నకు ॥మ॥ శ్రీరమణుల బాధించుట మేరగాదురా । కూరిరా । విచార । మిదేరా । సుధీరాత్మ మదనా ॥సు॥ బాలనురా నాజోలినీవు మరువరా । తాళా । సుశీలా । యిదేలా రతిలోలా । మదనా ॥ప॥ మందయానలపై మోహా మోందుకేలరా । యదుగో వి.దూ । ఆనందుడౌ నేచూచి ॥మ॥ యేలగలదు సుమ్మీమనక మానాల పురిడౌర చాలు నీవేలు కృపాభూడవు టొప్పు ॥మ॥

ఉ॥ శూలిశిఖాభ నేత్రమున । సోలియునీదు మనంబులో దిగుల్
చాలవహించకర్ సుజన । సంగతిమీరి పతివ్రతాంగనా
కేళియు గోరుచున్న నిను । క్రిందుగ జేయక శౌరి మాయడర్
యేలకృపాధ హీనుడవె । నిక్కము దెల్పవె నీవు నెచ్చెలీ॥

వ॥ హే మన్మథా నీకిట్టి దుర్వ్యసనము కూడదు యూరకొనుము. (అని చంద్రునుద్దేశించి) అహహా చంద్రా నీవైనను బుద్ధిలేక ననుబాధింప బూనితి విదిధర్మమా.

దర్వు—శశి॥ చంద్రబోధవరా గుణసాంద్ర మొక్కెను బుత్తేం ద్రిమా । ఇంద్రావిలాస పురంధ్రీ సుపుత్రానుకేంద్రాసంహార । దయాకరేం ద్రాధీరమనశ్చంద్రమ॥చం॥ కాంతామణులపై నీకింతకఠినమేలరా।యింతనిర్ద యతేలమంతనమునవింతవంతమా॥చం॥ నీచల్లదనముగని యాచించితిరా॥నీ॥ నీకిదిగాదు రాసిధర్మము లేదు యోచనా ॥చం॥ బాలనురా విరహమున కేను దాళజాలరా । శ్రీలధాత్రి మానాల పురిశ నన్నేలుమా చంద్రా॥

చ॥ పరమ పతివ్రతల్ సుగురు । భార్యగబొంది యఘంబుజెంది
సదురుడు శపించగా కళల । గోల్పడితావుగదా శశీనిరం
తరము మహారుజాత్తుడను । దప్పక నోరుచునుండువై నదు
మ్మురి వుబనుల్ విధింపుచున । సాధ్యుడవై తివిదేల చంద్రమా॥

వ॥ ఒరే చూడారా ఇకనైనను బుద్ధిమంతుండవై పాఖ్యపాపమ్ము లేక గుచున్న శపియించెద. (అని వాయువు నుద్దేశించి) పోమలయూశుగా నీకింత నాపై పంతమేలరా.

దమ్మా-శశి॥ ఏరా పాకిసఖూరా నీకిది మేరగాదురా । భారమహా నాపై నీవిప్పుడు జేరరాకురా ॥యే॥ చాలా నీకిదిసేలా నేసక తాళజాలరా చాలాసిగ్గ బ్రతిమాలితి నాజోలిమరువరా ॥యే॥ ఏలూనరగనానాలశ్రీహరి చాలముదమునా । గోలానై మక్కోలా నాటిది వీలుగాదుగా ॥యే॥

ఉ॥ శ్రీపతి తానుసర్వమయు । జీవులకెల్లను మేలుజేయ ప్రా
 జ్ఞాపని పూర్ణుగానినను । సర్వస్వతంతుడ్రుసు జేసియుంచెగా
 కీపని జేయుమంచు నియు । మించినడా సతీజాతికిద్ధర్మ
 తాపము లిచ్చుచుండుటిది । ధర్మముకాదుర మూరమూనసా॥

వ॥ హే వాయుదేవా ఇకనయిన నన్ను విడిచుపొమ్ము నీకిదే నమస్కరించెద (అనుచు నిట్లుండ)

అభిమన్యుడు ప్రవేశించును.

అభిమన్యాహ్వాయుడా ఘనుడా । సౌభగ్యకీర్తిత సుభద్రపుత్రుడా ఇభపతిసన్నుత శుభదాంఘ్రులు సౌరభసంబున నుతు । యిల్లవైరి భటులవిర్జింతూ । త్రిభువన జనులతిప్రభుడవనభాను । ప్రభదసద్భుశుంభద్వీరుడనే ॥యు॥ నీతికోవిద సంయుతప్రఖ్యాతి । గాంచు రణకౌతూహలుడను ॥ని॥ ప్రీతిచెలగ పరస్త్రీలనెల్ల నిజమాతలనుచుజూతు । యిల దుర్నీతుల త్రోసివైత్రు । భూతనాధునకు ధాతకు వెరువని । చాతుర్యుడ నతిశౌర్యధుర్యుడను ॥అ-॥ శీలగుణజాలుడనురా । మానాల పురీశుండేలును నిరతము । మేలగు కందుక కేళిసల్పుటకు బాలురతోగూడి । వనిలో । చాలనాటలాడి । యాలీలను తియ్యనిబూడేనెయు । గ్రోలివచ్చుటకు కోరివస్తినిటు॥

వ॥ మంత్రివర్యా !

మం-వ॥ హే ప్రభూ యేమియాజ్ఞ.

వాదు-అ॥ శృంగారవనముజూడ । శీఘ్రమంబుగా బోదమా । పొంగీ నానామృగముల పొలుపొంద ప్రేతమా॥

వ॥ మంత్రివర్యా మనమిప్పుడా శృంగారవనంబున కేళిక్రూరమృగంబులనెల్ల సంహరించి కొంతప్రొద్దు యాటలాడుకొందము నీవు రాగలవా.

మ॥ అభిమన్యా సుజనమాన్యా అవనీశవరేణ్యా। అభిమతముఁబట్టు లున్న నరుదెంతును పుణ్యా॥

వ॥ మహాప్రభో మీయాజ్ఞతో మీవెంబడి వచ్చుచున్న కారము పదుండి.

అ॥ అదుగదుగో వనమృగములు మదమెక్కియున్నవి। పదనైన భాణములచే వధియించవలెభుః॥

వ॥ మంత్రిశేఖరా యిదో వనమృగంబు లతిమదోన్మత్తలై సంచ రించుచున్నవి కదా వీటిని సంహారించుటకు ఆయుధంబులం దెమ్ము.

మ॥ నానావిధ ఆయుధములు వున్ని గైకొనుడిదో। మౌనత్వమున మృగముల మర్దించా వలెనదో ॥నానా॥

వ॥ రాజోత్తమా మీరిట్లు పల్కుచున్న ధ్వనివిని మృగంబులు వెరచి వెళ్ళును గావున మౌనత్వమున నేయుండి సంహారించుడు నేనిదే ఆయుధంబుల నందిచ్చినాడా.

అభి-వ॥ ప్రధానిశేఖరా అదట్లుండనిమ్ముగాని యొక విచారము న్నది యిటురమ్ము

మంత్రి-వ॥ అయ్యా అదెట్టి విచారము.

అ॥ పాంచీ యిందెవరో చెలులుచనుదెంచి యున్నారూ। గాంచీ నది యించునాతో కనులా కింపైనదు॥

వ॥ అహాహా యిచ్చోటికెవ్వరో సుందరీరత్నములు విచ్చేసియున్న ట్లుగ యున్నవారు యెవ్వరో తెలిసికొనిరమ్ము. అనుచున్న చూచివచ్చి.

మంత్రి॥ ధరణీ మానాపురి ద్వైత్యారిసత్కృపా। సరసీరు హాక్షీ యైన శశిరేఖయో నృపా॥

వ॥ హే రాజేంద్రా వీరలెవ్వరోయని వక్కాణించుచున్నవే మన బలరామస్వామి పుత్రికయగు శశిరేఖగాదా చూడుడు.

అభి-వ॥ ఔనౌను నేడుగదా నాభాగ్యంబు ఫలించినది సరిసీవిట్లుం డుము నేనాపోటివద్దకేగి యొకమాట బల్కివచ్చెద. (అని సన్నిధికిం జేర బోయి) శశిరేఖ సౌందర్యంబునకు మెచ్చి అహాహా యీ కన్యారత్నం బెంత సౌందర్యవతి దీని వర్ణింప బ్రహ్మాదులకు శక్యంబుగాదు.

సీ॥ ఈరామముఖమున కెనరాక చంద్రుండు। జంకి యింతింతకళంకమొందె
యీసతీ కుచములతో సరిరాలేక। చక్రవాకము లాశనమునచేరె।

యీసుందరీ వేణితో సాటిరాలేక । భ్రమరముల్ కమల నాళముల జేరె । యీకలకంఠిని వీక్షించి హరిణులు । తమ్ముతా మెరిగి గహ్వరములుండె ॥ రమణి రదనంబుతో సరిరాక మల్లె । కుట్మలంబులు వికసించ కోమలాంగి । లలిత మృదులాంఘ్రి కరయుగంబులను గాంచి । పల్లవములెల్ల కఠినత బరగియుండె॥

దర్వు-అభి॥ చెలియనిటుగన్న మిన్నా మదిభ్రమజెందితిరా ॥చె॥ చెలీ సరసమంజలీ । వినుత యగ్మలీ ప్రాణభూస్థలీ ॥చె॥ తరుణి ముఖమిందా యిందమూసరిగనిపించెగా ॥చె॥ సరి ఇది । వృకోదరీ । మహిత సుందరీ కంబు కంధరీ ॥చె॥ కలికిచనుబంతు లెంతో గనిగాంచితిరా । లలితాంగి నిర్మలీ వినయమండలీ । వేణికుండలీ ॥చె॥ తలిరులను బోలు విలుమృదుధారక పదములు । తీరి । దీనిస గతి । జూచి భ్రమసితి యానుసన్మతి । చెలిని యిటుగంటి ॥చె॥ ధరణి మానాల పోరిహరీ కరుణించుగా । హరీ కలుష సంహారీ దీనజనదరీ వినయ ద్రిమ్మరీ ॥చెలియ॥

శా॥ మున్నెన్నొప్పున్నము జేసియుంటినో కొ త । న్మాలంబునన్ జేసిబల్
చన్నొందన్ ప్రియభాగ్యగానియమిం । చెన్ బ్రహ్మనాకీ సతిన్
కన్నుల్ చన్నులుమున్నరుల్ ముఖముత । త్కామంబు ప్రియంబునే
కన్నారన్ గని భ్రాంతినొందితినియా । కాంతేమి సన్ బల్కునో॥

వ॥ ఓహో నేనిట్లు యోచించుచు యూరొక్కన్న ఫలంబు సిద్ధించునట్లు యడుగనిది కన్నతల్లియైన యన్నబోసంగదన విందును కావున యికొంతా శిరోమణి నొక్కసారి పలుకరించెద (అని శశిరేఖతో) హే సుందరీ రత్నమా నీవొకసారి యిటు వీక్షించుము.

శశి-తనచెలితో-వ॥ అమ్మా వీరెవ్వరో స్పష్టంబుగా దెల్పుకొనుము.

చెలి-వ॥ సరిమంచిది అయ్యా మీరెవ్వరు.

అభి-వ॥ నేను మీవారను.

చెలి-వ॥ అమ్మా వీరెవ్వరో కాని మీవార ననుచున్నాడే.

శ-వ॥ సఖీ యిట్లు బల్కుచున్న కారణంబెట్టిది యితడు వన యుక్తమన్య మహారాజా యేమి॥

చెలి-వ॥ కాబోలు.

శశి—వ॥ ఆహా నేనుగదా యీ మోహనాంగుని నాకన్నులార వీక్షించితి సరి.

దర్వా—శశి॥ ఆహా యీ సుందరాకారుని జూచినది మొదలు। అందముగా భ్రమజెందితిగానానందమాయెహా ॥అ॥ మేలుగ సిలిసితో మరుకేళి గూడి ననుగూడిననుజాలు । సేలూగనింద్రుడేలేటిస్వర్గామేలబడదుగా ॥అ॥ కాముని బోలుచు తన కౌగలించననుజాలు । కామించిమామోద గంధంబులెల్ల గాంచబడదుగా ॥3॥ కారుణ్యుడు మానాలశౌరి కరుణజూచి నను జాలు । అరూఢి సౌఖ్యంబులంది ప్రమోదము సందనౌనుగా ॥అ॥

సీ॥ ఈమోహనాంగుతో మారుకేళిగను । సల్పకోరనిసతి జన్మమేల । యీ సుందరుని కౌగలించియు కెమ్మోవి । గోరిలని యానందించి కోరకేల । యీరాజమౌళితో నింపొందబలుకని । బలుకనేర్చియు మృదు పలుకు లేల । యీ మనోహరునితో ప్రేమాతిశయమున । గూడియాడని వృథా యాటలేల । యిమ్మహాత్మునికని కన్యనిచ్చిపెండ్లి । జేసితత్పాదతీర్థంబు జెందిపుణ్య । మనుభవించని వియ్యంబు గొనుటదేల । జనకు డెరుగడు యీమహా ఘనుని మహిమ॥

వ॥ సఖీ చంద్రిముఖీ యిమ్మహాత్మునకు నన్నిచ్చి పెండ్లిసేయక నాతండ్రి పాపాత్ముడైన దుర్యోధనుని పుత్రుని కివ్వదలంచినవాడిదెంత న్యాయము వింటివా.

చెలి—వ॥ బాలికా పూర్వానుభవంబున్నట్టు లౌనుగాని యిట్టి విచారంబు లెవ్వరికిం జెల్లవు యేలా నీకిట్టి దుర్భ్రమ యూరకొనుము.

అభిమన్యుడు (తనలో)

వ॥ ఏమీ యీ కాంతామణి నేబల్కుమన్నను మళ్ళిబలుకకున్నదే కారణమేమో విచారించెద (అని ప్రకాశముగా) మనోహరీ మనోహరీ.

పాదం.

అ॥ కలికిసీ చిలుకపలుకులనుబల్కు మిందునొకసారి । వినవలచితినే నొయ్యారి । నావలపుదీర్చవె కోరి । పెంపలరు మన్మథుని బాధకోర్వ ॥క॥

ఈ॥ కామినినన్ను నీవిభునిగా వరియించియు మారుకేళిలో। నామదితృప్తి జేసివినయంబునబంపుమి నీకుమేలగు । యేమరజాలనింక నిను యేనభిమన్యుడమేనబావనై । కామునిబోలుదుగ వరుడగానుమయీ భువనైకమోహినీ॥

చ॥ మనోహారి శశిరేఖా నీకిప్పుడుమిక్కుటమగు యభిమన్యునితో నిన్నుగోరి యిచ్చటికి వచ్చెనుగాద నికపన్నలార పీక్షించి యొకసారి కౌగలిమ్ము.

శ॥ ఏలనాతో లీపొక సుగుణాంచాలనీయవోయి। భ్రమచేసి బడరాకోయి। యిదివేళగాదు పోవోయీ। లీలతిగదు మరుకేళిగూడ ॥యే॥

చ॥ పరిణయమొందియుండనిచి। భామినులెల్ల వరుల్ ధరిత్రి యప్పురులనుగాంచియుర్ విరహా। భారముదాల్చి విహీనమానులై బరగనవశ్యమున్నరక। బాధలనొందజె యేమనుష్యుడుర్ సరసవిచారులై యిటుల। సంగసుకర్మము రాచధర్మమే॥

వ॥ హే రాజకుమారా నీవిట్లు విచారంబులేని వాక్యంబులం బల్కనీతిగాదు. ఎట్టి మేనవాండ్రయినను వివాహాంబుగానిది భార్యాభర్తలగుదురా అట్లు భార్యాభర్తలమైన పిమ్మట యిట్టి వాక్యంబులన జెల్లుగాని యూరకనిట్లు బల్కంజెల్లదు యూరకొనుము.

అ॥ పడతీతగునేనీవిటులర్ పరవాసిగనర్ జూడా। యియ్యెడవచ్చితి భ్రిమతోడ। నాకఘుడియుతాళనేపోడ నాయెడదయరాని దదేలనేడు ॥ప॥

శా॥ కాంతారత్నమ సంశయించకనిటః। గాంధర్వపాణిగ్రిహం బెంతోమోదము తోడ సల్పియును। నన్నిచ్చోట నీనేర్పునర్ సంతోషింపగజేయు మెల్లఫలముల్। సంప్రాప్తమౌనీకు ధీమంతుల్మెచ్చెద రాత్మలో నిదియు స। న్మార్గంబగుర్ చూచితే॥

వ॥ హే సుందరీమణీ పరిణయమొందక నాతో రమించ నీ కిష్టంబుగాకున్న యెడల గాంధర్వ వివాహంబుననైన నన్నుబొందుము యిందువలన నీ కేదోషంబంటబోదు నమ్ముము.

శ॥ ఇటులాస్వాతంత్ర్య మింతుల కౌదయినను గలదా। దుఘటాటముర్ మానగవలదా ॥ప॥ స్ఫుటమివాహపరసుఖ ఫలదా యీ హఠమేలను సంకేటమా సుమి॥ యిటు॥

మత్తకోకిల॥ కన్నవారలయాజ్ఞ మీరియు కంజనేత్రిని దూరియున్। పిన్నపెద్దల కండ్లగాజక పిమ్మటన్ ముదమొందియుర్। యున్న

ధర్మములెల్ల కూరాయు । నోరి నోర్చక యుండియుఁ । తన్నుఁ తానె వరు
న్నిగోరు స్వాతంత్రతొల్లను సత్తమా॥

వ॥ రాజేంద్రా! మీరాన వాక్యంబులెల్ల స్వాతంత్ర్య విశారదంబు
లుగా నున్నవి అస్త్రీ స్వతంత్రితి స్త్రీ యన నాకొప్పదుపొమ్ము.

అ॥ వంశలా నీయోచనను నామనకొప్పదుగదె శాల । యిటు
లను దల్పకు మీశీల । మెచ్చవి పనులవియే బాల ॥ముఁ॥ ఘనులొనర్చ
నవి గనవె వినవె ॥వ॥

సీ॥ గాంధర్వ పరిణయ మొందిరె శకుంతలా । కాంతామణి యశంబు
జెందె । గాంధర్వ పరిణయ మొందిరుక్మాంగదు । కాంతమోహినియే
యశంబు జెందె । గాంధర్వ పరిణయ మొంది యూశర్మిష్ట । కాంతాల
లామ యేయశమునొంద । గాంధర్వ పరిణయ మొంది రెందరోసతుల్ ।
గాన వారికి యేయశంబుజెందె॥ ధర్మమునుదప్పి వర్తించతగదుగాన।
ధర్మమున్నట్లువర్తించ తగదేమి । కలికినీవిది వలదని పలుకుచున్న ।
మెత్తునేయేను తగను యిమ్మేదనందు॥

వ॥ సుందరి రత్నమా యుండటి మహాత్మ్రులెల్ల గాంధర్వలగ్నంబున
కిష్టులై వర్తించినది నీ వెరుంగవా తత్కార్యంబున వారేదోషంబు బొంది
యుండలేదుగదా మనకైన యిందువలన యెట్టి దోషంబున్నది.

శ॥ ఏలుఁ మానాలపురీ గోపాలుడా శౌరి । బల్మెలోసంగు నగ
ధారి । యీలీలా బల్కలేదాని । భూపాలవచించెద నాలకింపు॥

క॥ ఇతరేతర కాంతలకా । మతముఁ సలజెల్లుగాని మామాహరిస
న్మతభక్తవర్యులకుయా । మతమెంతయు జెల్లదంద్రు మనుజాధీశా॥

వ॥ యీలోకంబునగల్ల సతీమణుల కెల్ల యీ వరికారమే యొప్పి
యుండుగాని మావంటి విష్ణుభక్తుల కెంతమాత్ర మాస్వాతంత్రంబు జెల్లబోదు
యేలా వృథా వాదించుట తొలగిపొమ్ము.

(తనలో) అభిమన్యుడు.

వ॥ ఆహా యీకాంతారత్నంబును మెప్పించునది కష్టంబుగానున్నది.
దీని వాక్యంబులు వేదవాక్యంబులే (అని ప్రకాశముగా) హే సఖీమణీ.

వాదం—అ॥ తాళగలనా । వో బాలసుశీలా । యీలీలా బల్కనమ
గడియ ॥తా॥ గోపాల నీకెమ్మామియు గ్రోలగ మనసుదయించెనే । బాలా

నన్నిట్టులా జాలి నొందించకే సఖి ॥తా॥

వ॥ సఖమణీ మాటిమాటికి నీవిట్లు నిర్దయోక్తులాడ నామనంబు నిల్చునెట్లు వొకసారి యిటురమ్ము.

శ॥ వినువగ గలనా । యీ పుడమి కోవిదకోటులునుడివెడి ధర్మంబులనే ॥విను॥ మెడపక నీవిల చక్కని మొకయడవవి భ్రమజెందిన । కడ లల్లుడు మెచ్చునె నరకము ప్రాప్తించక పోవునె ॥విను॥

వ॥ హే రాజకుల రత్నమా నీవాక్యంబుల కేను భ్రమసి నీతో పొందినను కృష్ణ పరంధాముడు మెచ్చునా పండితులు నిందించరా స్వతంత్ర మెవ్వరికైన నొప్పదుగదా.

అ॥ సంతములేల । వొకాంతాయుత శాంతనా చింతా దీర్చవె శీలా । మంతనమున నీవు మేనమామ సుతవుగాన చూచి । భ్రాంతినొందతి నిందుల పాపమేమి తాపమేమి.

వ॥ మనోహరీ నీవు నామేన మరదలవుగాన నిన్నుగాంచి మోహించి యున్నవాడ నిందుకేమి దోషంబున్నది యీలోకంబున పుణ్యాత్ములెల్ల మేనవాండ్రు కావలెనని గోరుదురు గదా.

శ॥ తాళుమిగడియా । యీలీలా భ్రమలేలా । భూపాల పరిణయ ముదనుక ॥తా॥ యీలోకాపకీర్తి నేండజాలా దుశ్శీలానై । లోలవాక్యములు జెల్లునె లాలిత మానసులకు ॥తా॥

వ॥ రాజచంద్రమా నీమనంబు నన్నుం వలచియున్నను సరేకాని కొంతవరకు వివాహం బైనట్టుల యిచ్చా విహారులమై క్రీడింతముగాని యంతవరకు తాళుము లేకయున్న నీ లోకాపవాద జెందజాల.

అ॥ మానినియింత । దయలేనీ కృతిబూనీ । నాతో నీవిటులాడ దగునె ॥మా॥ మానసముగని వలచినవాని ద్రోసిపుచ్చుటకిల । లోనధర్మమగునె నెవరికైనా ముదమానావో ॥మా॥

వ॥ ఇందుముఖీ భ్రమజెంది యున్నవారిని మనోవికలంబుగా బలుకు టేమిన్యాయము నీవంటి స్త్రీలు కఠిన హృదయులై యుండుటజూచి సాత్విక వర్తనంబగు శ్రీహరి మెచ్చగలడా మదనశరా క్రాంతుడనగు నన్ను నిరాకరించిన దోషంబు వచ్చునని యెరుగవా చాలుచాలు నీవాక్యంబులు.

శ॥ పలుక దయతో । యీలీలావినజాలా మానాల గోపాలుడు

నర ॥సే॥ పాలుమాలి పరద్రవ్యముపై వలచిన వానిమెచ్చు : బోలునె ధర్మము నీవా । జోలి మగువవేల చాలు ॥యే॥

వ॥ రాజపుత్రా నీవిట్లు నిర్భయోక్తులాడం జెల్లదు ఆత్మాత్మీయములు శ్రీహరి పాలుగాకుండు నెరింగి అట్టి శ్రీహరి మెచ్చని కార్యంబున కొడంబడకున్నదాన యిదులకు నీవు నాయాత్మకే మేనవాడవా శరీరంబునకే మేనవాడవా వక్కాణింపుము.

అభిమన్యుడు తనలో-వ॥ ఏమీ యీస్త్రీవాక్యంబులు నాజిహ్వను నింతింత బంధించుచున్నవే యిక నేమి బలుకవచ్చును. విన యీ సాత్త్విక వచనంబులతో కార్యంబుగాదు సాహసించుటే కర్తవ్యము (అని శశిరేఖ కరంబునుంబట్టి ప్రకాశముగా) హే వగలాడీ నీబ్రహ్మజ్ఞానోక్తులు నా ముందరేమి సాగవు నిల్వంబడుము. నిన్నిప్పుడే రతికేళి గూడెద.

వాదం-శశి-సీ॥ న్యాయమే యిదినీకు శ్రేయమే యిలమహో । ప్రియమే నన్నింత బలిమిజేయ

అ॥ అవునవుపరవాడ నానవు నీవిభుడ । గానవు నిన్వడగలనె ఘడియ
శ॥ సారమా యిదికద్విచారమా । యింతధికార్యమా పోనిమ్ము ధీసమాన
అ॥ క్రూరమానీకిది భారమాన గూడ । నేరమాపుణ్యంబు దూరమాన
శ॥ కరముబట్టుటేల కాఠిన్యమదియేల । వరుడవై ననాడు వలతుపొమ్ము
అ॥ వరుడగానిదెట్లు వలచియుండనిదెట్లు । వేయుమాటలైన విందునెట్లు

శశి-వ॥ స్వామీ మీతో పెక్కు వాదింపజాల నాపై కరుణించి కరంబు విడువవలయు.

అ-వ॥ శశిరేఖా నీగొల్లమ కున కేను నిరాశుండనై పోవువాడను గాను పట్టినపట్టు దొలంగుట కేను క్షత్రియుండనగుదునెట్టు గాకుండుదు చూడుము నామనస్సంకల్పము.

శశి-వ॥ అయ్యా నేనబలను నన్నిట్లింత నొండజేయ ధర్మమా.

వాదము.

అ॥ నారీ యీ వగల మాటలేల నాతో
శ॥ మారుకేళి గూడా మేరగాదు నీతో
అ॥ చుంబనంబులీగదే మదనుండు వేయు శరంబులిదుగో
శ॥ చుంబనంబు లొసంగ సమయంబుగాదు సఖి జనంబులిదుగో

యికనువేశ్వరు మీయందరికిని మధుర । శర్కరాపూప ఘృతతైల
శాఖయుక్త । పాయసాన్నము నివుసమర్పణముజేసెద । యిమ్మనో
హరునెల్లప్పుడే. కొనుడి॥

వ॥ స్వామీ జనార్దనా నీకిప్పే సాష్టాంగవందనంబు లాచరింపు నా
నను కటాక్షించి యీ మోహనాంగి నా భర్తగా జేయుము దేవా.

చెలియవచ్చి-వ॥ అమ్మా శశిరేఖా మనమిచ్చోటికివచ్చి చాలా
కాలంబుజరిగినది కావున మనవారెల్ల నిరీక్షించగలరు పోదమురమ్మా.

శశిరేఖ-వ॥ సరిమంచిది అట్లనే పోదము (అని నిష్క్రమింతురు)

అభిమన్యుడు (లేచి) వ॥ హా శశిరేఖా! మనోహరి ప్రియబాంధ
రాలా నన్ను విడనాడి పోవనీకు న్యాయమా.

ఉ॥ ఇంతిమదీయ కోరికల । నెల్లసహించక నున్న మోహవి
భ్రాంతుని జేసినేడు పార । పాటునమూర్ఛిలజూచి నిర్దయా
మంతనమందు దాల్చియొక । మాటునగైకొని కెందమ్మివోయితో
చింతిలనాయె నీ విటకు । జేరిముదంబున కౌగలించవే॥

దర్వు-అ॥ శశిరేఖనయనకేక నీ వెటుబోయితివో ॥ప॥ శశిరేఖా దశ
రేఖా వశలేఖా శశిరేఖా దయ॥ సుందరాంగిరాగదే మరులొందితి గైకొ
గదే కందర్పునిశరమా నీయందమునుగ భ్రమసితి ॥శ॥౨॥ యింతీ చామంతీ
పూబంతీ యలదంతినాచెంతజేరి సుఖంపవె । సంతోషముగాను ॥శ॥ 3॥
వాసిగమానాలపురి వాసుదేవునీసత్కృప । నోసఖినాయందున యెటులు
న్నదో కా తెల్యదు ॥శ॥

వ॥ అహాహా! యీకాంతామణి మృదుమధురోక్తులకేను భ్రమసి
యుంటిగాని నన్నిట్లు మోసపుచ్చి వెళ్ళునని యెంతమాత్ర మెరుంగనైతి
నక్కటా యిక నేనేమిసేయుదు.

దర్వు॥ ఏమిసేయుదుశశిరేఖ యెందుజనెనో కానినే ॥ఏమి॥ మోహమై
నను జూపియు నొకముచ్చటాడదేమి నేరమో ॥యే॥౧॥ దంతియానయింత
నిర్దయురాలని యెరుగకిలను। మంతనమునసింత మహాభ్రాంతినొందితి హాహా
యే॥ నీలాలకి నాతో మరు కేళిఘటింపనకొంటిని । స్త్రీలమర్మమెల్ల దెలియ
జాలరు బ్రహ్మేంద్రాదులు ॥యే॥ 3॥ వాసిగ మానాలపురీ వాసుని కృప
యున్నజాలు భాసురాంగి నతిముదమున బాయక క్రీడింపవచ్చు॥

సీ॥ పుష్పబాణునినవ బూని యుక్తమునజ । యుంచి సేవకునిగాపింపవచ్చు
అనలాత్తు కోర్కెనా నసలక నల్లార్చి । ప్రీతునజేసి మెప్పించ వచ్చు
కామ్యమ్మువునా గాదోలి యెల్లప్పుడు । జీవించి పరిఖ్యాతిజెందవచ్చు
ప్రాణకోటులకెల్ల బాధి ంచుమిలను । బాధించి దరవేయ బంపవచ్చు
బ్రహ్మరుద్రాదులకు వశమగాను । నడచి వైకుంఠమార్గంబు
నడువవచ్చు । నని కౌసుబకీడ గంటినాపు । లనుగనుంగొని
మనసు నిల్పను వశమె

వ॥ ఏ తపాకి నను కలసతి బాసి యుండనోపరు కావున నకాకాం
తామణి నేనెట్లు విడనాడి యుండనోపగలవాడ అకటా నా ప్రాణాను
సారము నెట్లున్నదో తెల్యదు హా దైవమా యికనీవెదిక్కు (అని యూర
కొనును)

మంత్రి వాక్యం

వ॥ ఓహో యభిమన్య మహారాజా సర్వంబున నేర్పరివై యుం
డియు నీవిట్లు స్త్రీవాక్య మోహాంబుననుండిన పండితులు మెచ్చగలరా
లేలెమ్ము పోదము.

అభిమన్యుడు

వ॥ ఔనౌను మంత్రిశేఖరా యీలోకంబున తపోనిష్ఠ గరిష్ఠుల
కెల్లను స్త్రీవాక్య మోహంబున నేక నా యశోభంగము నేనింత యెరింగి
యెరుంగనివాని భంగి చింపుచున్నవాడ యిదెంత మూర్ఖత యికనైనను
మనమిచ్చటుండవలదు వెళ్ళుదము (అని వెళ్ళుదురు)

సుభద్ర ప్రవేశము-ద్విప॥ యమునకాలతీరక నీపదములె నమ్మియుంటి।
కదనధీరా నా పయిని కరుణ రాదేలరా ॥య॥ నీ పురందీ యర్జునుడు
నిలయుంచుయింతా । ఆ నాదమైన నీకుస్వామీ రుక్మిణీలోలా ॥య॥ కురు
పతినీకు తానే పరద్రవ్యమేమొసగె । అరయ ధర్మజుడు నీకు యుపచార
మేమిజేసె ॥యదు॥ ధరణి మానాలపురీ ధామ వైకుంఠవాస । కరుణించు
దీనులాల కరివరద శ్రీనివాస ॥ర॥

సీ॥ అలనాడు ద్రౌపది కంబరంబులొసంగి । గాచిరక్షించిన ఘనుడవీవె
లాక్షా గృహంబున లయమును గానీక । కాచిరక్షించిన ఘనుడవీవె
రాజసూయ మహాధ్వరమున దిగ్జయమిచ్చి । కాచిరక్షించిన ఘనుడవీవె
దూర్వాసు నడవిలో తృప్తుగావించియు । కాచిరక్షించిన ఘనుడవీవె
నేడుపాండు సుపుత్రులగోడుబాపి । శత్రుజయమిచ్చిరక్షించు మిత్రుడీవె

బాలగోపాల కరుణాలవాలశీల । రాగదే నామొహను యనురాగ/
మొసగ॥

వ॥ స్వామీ జనార్ధనా మీకన్నుంగొని యున్న నమ్ము రక్షింప నీ వొక్కరుండవుదక్క యన్యులు లేరు దేవా రారమ్ము రక్షింపు రక్షింపుము

నారదప్రవేశము॥ శ్రీశా శరణంమమికను జగదీశా । దీనజనేన పరికాశసుగుణాకర భానుప్రకాశ ॥శ్రీశా॥ యీశా । వికేశవదయాత్మ యశోద నందన ॥శ్రీ॥ మందరోద్ధారమారజనక యురవిందనాభ ముకుందమాధవా సుందరానన నందదేవాసుందసుత మానాలప్రకీశ్వర ॥శ్రీశా॥

వ॥ హే శ్రీహరీ అనంతా గోలబాలశివా జగద్రక్షకా దీనజనమందార శ్రీమన్నారాయణా అహో భగవద్ధ్యాన్న మెంతిభోగ్యమైయున్నది.

సుభద్రా వాక్యము.

వ॥ స్వామీ యతికులసార్వభౌమా మీపాదాబ్జంబుల కిదే ప్రణమిల్లెద కటాక్షించుము మహాత్మా.

నారద—వ॥ అహాహా సుభద్రా సాధ్వీలలామ వర్ధిల్లుము వర్ధిల్లుము భగవత్సోదరివగు నీభాగ్యంబు కొనియాడశక్యమా.

సుభద్ర—వ॥ సరి మంచిది కాని మదగ్రజుండగు బలదేవుండు శశిరేఖ వివాహంబెన్నడు కావింతునని యున్నవాడో తద్వార్త మీకేమైన తెల్యునేమో వక్కాణింపుము.

నారద—వ॥ ఓహో సుభద్రా నీవట్టివార్త యెంతమాత్ర మెరుంగకనే యున్నదానవే సరి యవ్విధంబు నేజెప్పెద వినుము.

సుభద్ర—వ॥ స్పష్టంబుగ బల్కుడు.

నారద ఉవాచ.కందార్థం॥ బలవంతుడు శ్రీమంతుం । డలదుర్యోధనుడటంచు । నతని సుతునకున్ । బలుముదమున శశిరేఖను । విలసితముగ నివ్వబూనె। వినలేదానీవు యట్టివార్త వే విస్మింతువినుమికన్ సంపూర్త। తనుమధ్యరో మీరలు పేదరికము గలవారని తా । వినినంత నెరోయుచుండు గాన । యేమని తెల్పుదు నింకనీతో దానా॥

వ॥ సుభద్రా మీరెల్లరు సిగుపేదలని మీతో వియ్యంబు గొనుటది సహించక నీయన్నయగు బలదేవుండు దుర్యోధనునితో వియ్యంబందప్రయత్నమున నున్నవాడు గాన నీవతి సాధ్వీరత్నంబగుట తద్విధమంతయు

స్పష్టంబుగ జెప్పితి నా మాటయసత్యంబుగాదు నమ్ముము.

సుభద్ర-వ॥ హా స్వామీ యిటేగున్యాయము నాపుత్రుడు మేనవా డైనందుకు యుక్తమన్నను వేరొకనికి నిచ్చునట్టి స్వల్పబుద్ధి భగవంతు డగు మాయన్న కేలబుట్టెను యిది కాలవైచిత్ర్యగా బోలునా యేమీ.

నారద ఉవాచ.

వ॥ అమ్మాయిదియంతయు నీయన్నపక్షపాతమేకాని వేరొండులేదు.

సుభద్ర-వ॥ హా దైవమా నేకెంత కష్టకాలము సంభవించెను.

వాదం-సు॥ ఎంతోనిర్దయబూనెనిలశశిపాణి । కింతైనదయలేనిదే మోవిన్నాణీ ॥ఎం॥

వ॥ సర్వజ్ఞడగు మాయన్న నాయుండు యింత నిర్దయాళుడై యుం డుటకు కారణంబేమో తెల్యదు.

నా॥ కన్నెయపేదలను గందూరేకనుల । అన్నయితేనేమీ నాయి న్నయితేనేమీ ॥కన్నియ॥

వ॥ సుభద్రా యీ లోకంబున సంపత్తులేక నిరుపేదలై యుండుటే కష్టము అట్టి నిరుపేదలను గుణాఢ్యులైనను మన్నించరని నీకుం దెలసిలేదా నేజెప్పవలెనా.

సుభద్రా॥ ఆరామునకు నిదియు అన్యాయమంచు । మీరైనవిన జెప్పలేరైతి రేలా॥

వ॥ స్వామీ మునికులాగ్రగణ్య మహాత్ములగు మీరైన యిట్టి కార్యంబు యన్యాయంబని మా యన్నకు విన్నవించవలదా.

నా॥ వినుమన్నవినలేదె వినవేవో జననీ । వినకాకోపించెనే నను తాను భువినీ ॥వి॥

వ॥ అమ్మా నేనన్ని విధంబుల బోధించినను నామాట సహింపక నన్ను కోపించినాడు గాన తత్కోపంబునకు భయపడి వెళ్ళివచ్చినాడ అందుల కేమిసేయువాడ.

సు॥ వాదించియెవరింత బోధించినారో । హాదైవరాయ నాకాధార మెవరో ॥వాదించి॥

వ॥ పరమ సాత్వికుడగు మాయన్నకట్టిబుద్ధి తనంతట తనకుబుట్టదు గావున యెట్టి పాపాత్ములిట్లు బోధించినారో కాన తెల్యదు.

నా॥ చింతేల మానాల క్రీశునినమ్మి। కాంతా యాగోపాలునిగని వేడుకొమ్మి ॥చి॥

వ॥ అహా నీవిప్పటునుండి విచారించి బనిలేదు నీయన్నంజేరి పలు విధంబుల వేడుకొను పొమ్మ ఆవల నీయదృష్టము.

సుభ—వ॥ స్వామీ మీరను విధంబుననే పోవుదాన.

నార—వ॥ సరి శీఘ్రింబున వెళ్ళుము నేనిదే సత్యలోకంబున కేగు చున్నవాడ. (అని నిష్క్రమింతురు)

బలరామ సభ – సుభద్ర వాక్యం.

వ॥ అన్నయా నీ ప్రియసోదరినగు నన్ను దయచేసి యొకసారి యిటు వీక్షింపుము.

బల—వ॥ సోదరీ యేమివిచారము కడుపార గుడుచుచు అంతఃపురం బున నుండక యిచ్చటికి వచ్చు కారణంబేమి.

సు॥ యేమినేరాము దోచె యింతనిర్దయ జూడా। యేమో మన శశిరేఖా నెవరికో యిత్తురటా.

వ॥ అన్నయ్యా మన శశిరేఖను యభిమన్యున కొసంగక వేరొండు వారికివ్వదలంచితిరని వింటిని అదెట్టి కారణమో తెల్యకున్నదాన వక్కా ణించుడు నాయందింత యపచారంబు గలిగిన దేమియది మీరిట్లు నిర్ద యాళులుగా నుండనగునా.

బ॥ వినవే నామనవిని సుభద్రా ॥వి॥ ఘనుడనిమా యర్జునునకు నిన్నిచ్చినదే హీనము జెప్పగనేలా ॥వి॥

వ॥ సుభద్రా పరమ పురుషార్థియని దురదృష్టుడగు యర్జునునకు నిన్నిచ్చినీఘోష చూచుచున్నదిచాలక నింకను శశిరేఖయునురు బుచ్చ కొనుమంటివా చాలుచాలు యూరకొనుము.

సు॥ కలిమి లేములు రెండు కలియజూడవాదేలా। తెలిసి పల్కారయా యిట్లు బల్కుట ధర్మమేనా.

వ॥ అయ్యయ్యో రేవతీరమణా యర్జునుండు దురదృష్టుడా కాదు ధర్మంబునకు కట్టుబడి యుండెనింతియేకానినొకరికి భయపడియున్నవాడు గాడు యెట్టిదీనరికంబై నకొంతకాలమేకాని యెల్ల కాలముండబోదునమ్ముము

బ॥ పిమ్మట సౌఖ్యములు గుడుచేది నమ్మకమేమని నమ్మ వచ్చునే

దామిస్త్రనటుభద్రిమ యదుర్భద్రిమగాదే ॥పిమ్స్రట॥

వ॥ సోదరీ పిమ్స్రట సౌఖ్యంబువచ్చునది మనకు దెలియునా య

ప్పాండవులు కురుపీరుల బాధింపబడి వారినెల్ల జయించి రాజ్యమేలునది

యబద్ధంబుగాని నిక్కంబుగాదు యేలా యిట్టి దుర్భ్రమలు.

సు॥ ధర్మమే జయమంచు ధర్మశాస్త్రము లేదే। కర్మసాక్షిగదుష్క

ర్మల కేది ఫలము ॥ధర్మ॥

వ॥ అన్నయ్యా యెంత కష్టంబైనను ధర్మమేజయించుచున్నది గాని

దుష్కర్ములగువారి కెందును జయంబు లేదు యున్నను కించిత్కాలమేకదా

బ॥ నాకున్ మూనాల పురిశు ॥నా॥ అకస పక్షికి నాశించినతరి

ప్రాకటముగ నిటుబలుకకు చాలునె ॥నా॥

వ॥ సోదరీ తానుయెట్టి ధర్మంబున వర్తింపుచున్నను పూర్వ కర్మం

బు దీరనిది జయంబు లేదు పాండవులింతలో జయంబు గొనునది నేనెరుం

గను బాలికనిచ్చుట న్యాయంబుగాదు పొమ్మా.

వాదం——సు॥ అన్ననీవిటులనరాదే। ఆసకెందియుంటిగాదే।కన్న

నివ్వననగరాదే। సన్నుతగుణ సంపన్నా ॥

వ॥ అన్నయ్యా మీరిట్లు మమ్ము నిరుపేదలని భావించి బాలికనివ్వ

ననుటచే నామనంబున పరితాపంబు గలుగుచున్నది యిట్లేలబల్కెదవు.

వ॥ వాదేల జేసెదవే। నాతో యీ ॥వా॥ శోధించినన్నెంతబోధిం

చినాగాని కాదందు మర్యాద కౌంతేయ వియ్యంబు ॥వా॥

వ॥ హేసుభద్రా నీవెంత వేడినను నేను వినునది లేదునాతో పెక్కు

వాదించరాకుము మీతో వియ్యంబందునది యేనుంగును విడిచి మూష

కంబు నెక్కినట్లున్నది నేనిట్టి హీనత కోర్వను పొమ్ము.

సు॥ మేనల్లు డభిమన్యుడు। మీాన కేతను సమానుడు। నానలేని

సుజ్ఞానుడు। న్యూనముగా జూడవలదు। అన్ననీవిటులనరాదే ॥

వ॥ అన్నయ్యా మమ్ముగని మన్నించకున్నను నీమేనల్లుని సాహ

సవితరణాది గుణంబులుగల యభిమన్యునైన కటాక్షించి మన్నించుము

అట్లుగాకున్న దీనులమగు మమ్మెవరు రక్షింతురు.

బ॥ వాడెంత సుజ్ఞానుడైన। యున్ననేమి। కూడు గుడ్డాలు లేక

ఘోరాటవీ జేరి। గోడుగుడుచువాడు యీడా నాపుత్రికి ॥వాడె॥

వ॥ బాలికా సుభద్రా నీపుత్రు డెంతరూపలావణ్యవిశేషుండై నను సంపత్కరుండుగాడు అట్టి దరిద్రునకు సర్వసౌఖ్యంబు లనుభవింపగ నాపుత్రి నిచ్చుటొప్పను బంగారు ఖడ్గంబని గొంతు దెగవేసు కొందురా.

సు॥ తోడబుట్టినదాన । వీరనీకు ధర్మమేనా । వేడుకొంటి కొంగు బట్టి । జూడవలయు నాపై కృప ॥తో॥

వ॥ తండ్రీ బలదేవా యెన్నివిధంబులనైనను తోడబుట్టినవారినివిడ నాడుట ధర్మమా నిన్నిదే పలువిధంబుల వేడుచు కొంగొడ్డినదాన కన్యా భిక్షం బొసంగుము నీకతి పుణ్యంబు సిద్ధించగలదు.

బ॥ యేలునో మానాలపురి । గోవిందు । చాలుచాలా నాదు సాటీ వారువిన్న । గేలీజేసెదరు బాలానివ్వాపొమ్మి.

వ॥ సుభద్రా నీవెంత వేడినను నామనంబొప్పకున్నది సాటివారు విన్న నగుబాటులౌను నీవాడబిడ్డవైన నాయింటిలోనుండి కడుపార కుడుచుచు నుండుము పొమ్మా ఏలా నీకిట్టి పిలువని పేరంటము.

సు॥ దేవామాకు దిక్కెవరు । యీ వసుధను మీరిటులన్నా । భావమలర పాండవేయుల్ । పాపనులు మీభక్తులయ్యె । సావధానాముగ మిమ్మె సమ్మతింతు లెల్లప్పుడూ ॥

వ॥ దేవా యిదివరకే పాండవు లరణ్యంబుననుండి శ్రమల ననుభ వింపుచున్నవారు వారుగాక మేము మీ కృపలేక బాధపడుచుండుట మీకు సంతోషమా యేలా మీకీనిర్దయా.

బ॥ చాలుపోపొమ్మి ।నా। జోలికిరాకు సరెసరె । బేలవిన్నర్జును నకు । మేలంచు నొసగినయా । శ్రీలోలునివేడుకొనుముచాలాశీలాబాలా

వ॥ సోదరీ విన్నా యర్జునునకు నేనొసంగిన వాడనని నాపుత్రిని నీ పుత్రున కొసంగువాడనా యీ సత్కార్యంబులా కృష్ణుని వలన నగుచుం డును వానినే వేడుకొనుము పొమ్మా నాయధికారంబేమియు లేదు.

సు॥ నిన్నెనమ్మియున్నచాలా । నన్ను నీవిట్లాడు టేలా।కన్నతండ్రి నీవెయుంటి । కన్నె నివ్వా వేడుకొంటి । అన్నానాపై యెన్నరానియు నన్నేరా మేమిచాలా ॥దైవమా॥

వ॥స్వామిజనార్దనాయీసత్కార్యసాధనుండవై నీవుండిఇట్టికౌటిల్య వాక్యంబులాడతగదు నా దీనాలాపంబు లాలకించి రక్షించుటొప్పు దేవా.

ఒ॥ యేమనవింటివనటే । యిలలోననీకు గాకహానికైనను ॥యే॥ చాలా నాతోవాదము మానమన్న మానకిలను । మానలేక ఒల్కిన మానాల పురీశుడుమెచ్చునె ॥

వ॥ సోదరీ అంతఃపురానికలంబున శాశించినట్లు నీవే మోనన్న బోధింప వచ్చితివిగాని వినవాడ గాను యిష్టంబున్న మద్గృహంబునందుమా లేకయున్న నీప్రియుండున్న చోటికైన వెళ్ళుము బ్రహ్మాదులు సంస్తుతించి నను శశిరేఖను నీకొసంగునది లేదు నమ్ముము.

సుభద్ర—వ॥ హాదైవమా యిక నాకెవరుదిక్కు.

గీ॥ తల్లిదండ్రులైన దమ్ములన్నలునైన । సఖులైన బంధుజనులునైన
పేదరికముజూచి పిలువరుతలువను । మనుజనోక్తిసత్యమయ్యెతోచె॥

దరు—సు॥ దైవమానేనేమిసేతు దాపుయెవ్వరు । యీవసుధను పూర్వమందు యేమినోచియుంటినో నా। దేవకీసుతుడీవిర్దయుడు భానమందునలచె మహా । పుట్టినింటికెంతో యాశపూనిజెందితి । యిట్టిదర్శమనియెనోతో బుట్టువారినికావిడుచుట । పట్టనివ్వపలదపఱె పామరుడిటుబోధించెనో ॥
దైవ॥ యీమహినేనెంతపాపమేదిజేసితి । నామనోహరుండు కాననంబునం దుశ్రమలనబడుచు ।యీమహి యీవార్తవిన్న యెంత దుఃఖమొందునో కా॥దైవ॥ ధారుణిమానాలపురి ధామానను బ్రోవవె । కౌరవులోనరించెడు యాఘాతల జెందకనీయా । ధారమునను గాదె బ్రతికిధీనులమైయుంటిమిధర॥

వ॥ శ్రీహరీ యాపత్కాలబాంధవా నాప్రియుండరణ్యంబున శ్రమలనుభవించుచు దుఃఖించుచున్నదిగాక నేనునాసూనుండువిరాధారులమై యుండి దుఃఖింపవలసివచ్చెనుగదా యిక మమ్ము రక్షింప నీవుగాక వేరొండు దైవంబు లేదుదేవా (అని చింతించుచున్నంత)

నారదప్రవేశము—వ॥ అమ్మా సుభద్రా నీవిట్లు చింతనొందకారణమేమి.

సుభద్ర—వ॥ అయ్యా నేనేమిజెప్పుదు మాయన్నయగు బలదేవుడు నాయందు నిర్దయాళుండై నేనెంతవేడినను నామాట తిరస్కరించి శశిరేఖనివ్వనని మమ్ము వెడలనంపినాడు యిందులకేమిజేయనగును స్వామీ.

నారద—వ॥ ఆహాహా సుభద్రా పరమపుణ్యులగుమిమ్మెల్ల నొక తృణమాత్రంబుగాజూచి యాబలభద్రుండు శశిరేఖను మీకొసంగక అన్యులకొసంగబూనిన వాడింతియేకాని నీవిధుని వరితాపంబెయుంగడు సరి నేనొక మాటజెప్పెదవినుము.

సుభద్ర—వ॥ అట్లైనవిచారము.

పాదం—నా॥ వగవకుమమ్మా నీ । ప్రియమనమను దెల్పెదనీక్షితి । తెగువతో వారిందువచ్చి తెగజూతురు కురువీరుల.

వ॥ బాలికా నీవింతమాత్రము దానంతంబునొందపనిలేదు నేనిదే పోయి భీమార్జునులను దోడితెచ్చి కురువీరుల మర్దింపజేసినీకా శశిరేఖ నొసంగునట్లు జేసెద నమ్మము.

సు॥ యేటికియాజ్ఞోలియు మా । కేవిధినైన నొప్పదయ్య మాటి మాటి కనం నిమాటలు తాబల్కెనునన్ । సాటివారిలోన నగుబాటు లాయెనయ్యయో యింకేటికీ ॥

ఉ॥ వెన్నెలలేనిరాత్రిసుక । విత్వరసజ్ఞతలేని గ్రంధమున్
యన్నవలేని యిల్లునర । మాన్నము లేని సంపత్రిభు త్రియున్
మన్ననలేనిచోటు యువ మా । నత హీనత గల్గుతత్పురిన్
గన్నయనేక దోషమును । గల్గకయున్న యతీంద్రచంద్రమా॥

వ॥ కావున నేనిట్టు నపహానతగల్గుచోట నెవ్విధంబైననుండనొల్లను నాసుతునితోగూడి నామనోహరుం జేరబోయెద నావలనేమైనసరె కాని మహాత్ములు మీరు నన్నాశీర్వదించిపంపుడు.

నా ర ద ఉ వా చ

వ॥ ఓహో సుభద్రా నీవనుమాటలెల్ల సత్యము సత్యము ప్రాణ పరిత్యాగంబునకైన నొప్పవచ్చునుగాని యవమానత కొప్పరాదు సరి యేను మెచ్చినాడ.

నా॥ మంచిది నీవటులనె మానవపతినింజేరుమి చంచాలాక్షీ జయ మగుయా చక్రిధరుని యాజ్ఞగొనుమి ॥మంచిది॥

వ॥ మంచిదినీవటుల నేనిజపుత్రునింగూడి కృష్ణపరంధాముని సెలవుం గొనిపాండవులంజేరబొమ్ము నీకజయంబుసిద్ధించగలదునామాటనమ్ముము.

సు॥ యేలునమానాలపురి । శ్రీలోలుండైనశౌరి । నేలుగ మాకి లమీ యాశీర్వాదమింతేచాలును । శీలాశ్రితగోలా । గుణజాలాసంతోష ముగా ॥యే॥

వ॥ అయ్యా మీరనువిధంబున నే కృష్ణపరంధాముని యాజ్ఞగొని పాండవుల జేరబోయెదగాని నాయందు మీకటాక్షంబుంచుడు.

నారద—వ॥ సరిమంచిది పొమ్మా నేనిదే దేవపూజకు వెళ్ళెద.

శ్రీకృష్ణుని ప్రవేశము దరువు

నందనందనుఁడా క్షితిధరా । నందకుమారుఁడా । బృందారకముని బృందవందితుఁడ । కందర్పునిసము సుందరాంగుఁడను । మందరోద్ధరుఁడా । ప్రఫుల్లఅర । విందలోచనుఁడ ॥నం॥ కామజనకుఁడరా।మహితసుత్రామవిభవుఁడరా । సోమవదనుఁడను రామానుజుఁడను । తామసాత్ములను దండించిన నం । గ్రామవిజయుఁడరా।యశోధన । ధీమంతుఁడమధురా । శీలవర్తనుఁడ మహితమా । నాలవురి ధవుఁడా । యాలపాలుఁడవిశాలవక్షుఁడర । మాలలామహృల్లోలుఁడశ్రీ గోపాలబాలుఁడరా । మనోహార । నీలవర్ణుఁడరా.

వ॥ ఉద్ధవా ఉ-వ॥ కింభో దేవతా సార్వభౌమా.

శ్రీ కృ ష్ణు డు

వ॥ పరమ సాత్వికవృత్తితోనుండు మనద్వారకాపురంబున నేమో వినయవిహీనంబు జరుఁగఁబోవుచున్నట్టుగా తోచబడుచున్నది కారణం.

ఉ-వ॥ అయ్యా అదెట్టికారణమో నేనెంతమాత్ర మెరుఁగకున్న వాఁడ యిదే మన సుభద్రవిచ్చేయుచున్నది విచారించి తెలుసుకొనుఁడు.

సుభ-వ॥ అన్నయ్యా మీకిదే పదివేల వందనంబు లాచరించెద కటాక్షించి నామొరలాలించుఁడు.

శ్రీకృ-వ॥ అమ్మా సుభద్రా నీవేమో చిన్నబోవు ముఖంబున ఖిన్నురాలవై యిచ్చటికి వచ్చినకారణంబేమి.

వాదం-సు॥ అన్నయ్య వినుము నామనవీ యున్నవిధముదెల్పెద॥ అ॥ కన్నియ శశిరేఖను నాకన్నసుతుని కివననిన।న్నెన్నో మాటలాడెను మది చిన్నబోవనాయెను ॥అ॥

వ॥ అన్నయ్యా మన యన్నయగు బలభద్రుండు తన పుత్రికను నాపుత్రునికివ్వనని నేనెంతవేడినను నన్ను ధిక్కరించి నామాటసహించక వెడలించిరి నీవే దిక్కని వచ్చినదాన కృష్ణా.

కృ-వ॥ ఆహాహా యిదెంత విచిత్రము.

కృ॥ సోదరీ సోదరి । యాదవకులచంద్రిక । మర్యాదలేక యిటు లనెనా ॥సో॥ మేదిని సుగుణాత్ముఁడైన మేనవానికివ్వక తా। నేదురాత్మ నకును సుతనిత్తునని ప్రయత్నించెనె ॥సో॥

వ॥ సుభద్రా పరమ నీతి కోవిదుండగు మన యభిమన్యున కివ్వక శశిరేఖను యేదురాత్మునకిత్తునని యత్నించి యున్నవాఁడో దెల్పుఁడు.

సు॥ నిర్వేదల మటనేవేము । సర్వశయన వినగదె ॥ని॥ తూర్పు ధవుని సమానుడు । దుర్యోధను సుతుడటకం । దర్పాసక వానికి సుత నర్పించునటకద ॥ని॥

వ॥ కృష్ణా మేమెల్ల బీదవాండ్రమని దలంచి తనపుత్రిని మాకిచ్చిన సౌఖ్యంబు లేదని పాపాత్ముడగు దుర్యోధను పుత్రునకివ్వ యత్నించిన వాడు గాన నిక మేమెందుబోవు వారము.

కృ॥ చాలునెచాలునె । చాలదెలిసె నేడిక మానాల పురీశునివిన యము । వీలని పాపాత్ములతో వియ్యమంద గోరుచెల్ల । నీలాలకి య కార్యము నిర్వహించునే ధరలో ॥

వ॥ బాలికా యపాపాత్మునితో బలభద్రుండు వియ్యమందగోరు చున్నవాడిదెంతన్యాయము అయినను యకార్యము నిర్వహించునది చూతముగాని నీవెంతమాత్రము ధావంతంబు నొందక యిచ్చట నా సన్నిధిన నుండుమా,

వాదం-సు॥ అన్నా నన్నెన్నో మాటలు బల్కె ॥అ॥ అన్నరీతిం బల్కుటకు నోరాడదిచ్చటా నుండనోపను।కన్నసుతునిగూడినాప్రియు। డున్నచోటికి బోదునేనూ ॥

. వ॥ దేవా యాబలభద్రుండు తోబుట్టువనని నన్నెంత మాత్రమూ కన్నుగానక యసహ్యముగా బల్కినవాడు గాన యొక్క క్షణంబైన నేని చ్చట నుండజాల నామనోహరుం జేరబోయెద సెలవొసంగుమూ తండ్రీ,

కృ॥ ఏటికినీకిట్టిచింత । నేటికి యిచ్చోటనెయుండుమి మాతో । కోటిమృగములున్నయామ । హాటవికిని బోవలదు । మేటినీమనోహరుడె చ్చోటనున్నవాడో తెల్యాను ॥

వ॥ తల్లీ నీవిట్లు ధావంతపడుచు తొందరపాటువనరణ్యంబున కేగ వలదు నీప్రియుండెచ్చట నున్నవాడో గానంబడదు వృథాశ్రమ లెందుకు నీపుత్రునకేను వివాహంబు గావించెద నమ్ముము,

సు॥ శౌరీనీకారుణ్యమెచాలుశౌరీ।ధారుణినాసుతున కెట్టినారిమైన ముదంబెకానీ । హాటనీశశిరేఖనిలలోగోరి । గైకొనుటొప్పదేవోయన్న,

వ॥ అన్నయ్యా మత్పుత్రునికెట్టి కన్యనైనదెచ్చి వివాహంబు గావింతువుగాని మీశశిరేఖ మాకుంబట్టదు మీరను వాక్యంబులెల్లను నా మనంబునకు విశదమయ్యే యున్నవి.

కృ-వ॥ ఆహాహా సోదరీ నేనెంతచెప్పినను వినకున్నదానవు యిక నేనేమిసేయుదు అబలవు నిన్నరణ్యంబునకు బంపియుండదగునా.

కృ॥ మేలునుమానావతికి సీతా-బరమావృదు రూపవిశేషము॥ మే॥ బాలునిగూడి యరణ్యము యేలీలగ చరింతువు ఇక। శీల యీరథంబు గొనియు। కేలుగ నేలమి మేలా ॥మేలును॥

వ॥ సోదరీ సుభద్రా నీవునీబాలుండు యరణ్యంబున పాదచారులై సంచరింపజాలరు యిదేరథంబుంగొని వెళ్ళుడు పిమ్మట మీమనోరథంబు సిద్ధింగలదు.

సుభద్ర-వ॥ స్వామీ రుక్మిణీవల్లభా మీకటాక్షంబు మాపైయుంచి మమ్మాదరింపవలయు దేవా.

కృ-వ॥ సరిఅట్టులే నాయనుగ్రహంబు మీయందుండును గాని దివారాత్రిలు నన్ను ధ్యానింపుచుండుడు.

సుభద్ర-వ॥ చిత్తముదేవా అని (అచ్చటినుండి వెళ్ళివచ్చి మనసులో) హా దైవమా నామనోహరుండు యెచటనున్నవాడో నేనెంత మాత్రి కనుంగజాలనైతి యికమేమేమార్గంబునం బోవలయునో తెల్యదు యింకా ప్రాప్తంబెట్టులున్నదో.

సీ॥ పతినెడబాసి యాపద కెంపుటొకటి। పరగృహంబున మాటబడుట రెండు। దాయాదులెల్లనిర్దయ బూనుటవి మూడు। యడవి కేగియు కష్టపడుట నాల్గు। అన్నపానములేక నతికృశించుటయైదు। యెండ వానలకోర్చియుండు టారు। క్రూరమృగంబులకును భీతిగొను టేడు। సన్మార్గమునుదప్పి జనుటెనిమిది। యిట్టి యష్టకష్టంబుల జుట్టుకొనుట పేదరికమనగాదె యిమ్మేదినందు। యిన్నిటికి యెట్టులనుభరియింప నగును। నాగతియు నీవెరాగదు నాగశయన॥

♦ సుభద్ర దరు ♦

శ్రీహరియెంతటి ద్రోహికాలముగల్గె। సాహసించి విపినంబుచరి యించుటెట్లోపూని। బాలుడునాపుత్రుడీ బాధకోర్వగలేడు। యేలీల వానిఘోషావీక్షించనోపు దేవా ॥౧॥ పటుతరదుఃఖముతో ప్రాణేశుడె చటుంమనో। యెటుబోదువారిజాడ యెటుగానబడదు హా ॥౨॥ ధరణిమా నాలపురిభామరుక్మిణిలోల। కరుణించుదీనురాల కామజనకానుశీలా.

వ॥ హా శ్రీహరీ ఆపత్కాలబాంధవా ఆపన్నరక్షకా జగద్రక్షకా

దీనురాలవగు నామొరాలించి రక్షించుముదేవా (అని చిన్నబోయి యున్నరాలై యున్నంతలో అభిమన్యుండు వచ్చిచూచి)

అభిమన్యుడు తనలో — స॥ ఆహా యిదియేమి విచిత్రము ఎన్నడో గాని నాతల్లి చింతిల్లుచు చిన్నబోయి యున్నది కారణమేమో తెలియదు (అని ప్రకాశముగా) అమ్మా నీవిట్లు చింతించు కారణమేమో నీపుత్రుడ నగు నాకుం దెల్పరాదా (ఆహాయిదియేమి నాతో బల్కకున్నది)

దర్వు—అభి॥ జననీ యెందుకేనీ వింతచింతజేయుట । మనసునందు వలదు ధైర్యము విడనాడుట । తనయునందుతగునె మదిలో ప్రేమ మీరుట । వినవు మిందునీతో ఖలులెవ్వరు । యేమని పల్కినారో ॥జన॥ ఘనుడనైన యుండగను భయము దేటికి వినక । మానంబునుబూననేలమాటికి । జనకునైనను కొనితెత్తు నిచ్చోటికి । మనవు మానాల వురీశుగతి । మన్నించు నిరతము ॥

సీ॥ జనకుడే కాననంబునశత్రువులచేత । జిక్కి దుఃఖించెనో మిక్కుటముగ
జనయిత్రి జనకులే యనరాని వాక్యంబు । లనుబల్కి నినువెళ్ళు మని రోజెపుమ । కన్నియునివసంచు కామపాలుండునిక । బీదరాలవటని ప్రేలినాడో । పతిని విడచియెంత పర్యంతమిందుండ । వలెనని నీవిట్లు వగచితేమొ । భాగవతులందు యపచార పడినవేమొ । అన్నమాట యుదప్పి నీవడలితేమొ । యెట్టివా స్తవమో నాకదెరుగ బల్కు ।
తల్లి నీదు మనోరథంబెల్లదీర్తు ॥

వ॥ తల్లీ నీవెంతమాత్రము చింతిల్లక తద్వ్యధం బేమొ నాకుందెల్పుము నీయభిమతంబు నేదీర్చెద.

వాదము — సు॥ తనయా వినిపింతువినరా । యూవార్తవో ॥త॥ మనము బీదలమంచూ నీమామ బలుడూ తనకూర్మి । తనయను దుర్యోధను తనయున కిత్తుననియె ॥తన॥

వ॥ కుమారా మనమెల్ల బీదవాండ్రమని నీమామ బలభద్రుండు నామాట తిరస్కరించి తన పుత్రిని దుర్యోధనుని కుమారున కిత్తునని యెత్నించి యున్నవాడు కావున పుట్టినింటి యాశ తొలంగెనని ధావంతంబున నున్నదానను యిక మనకెవరుదిక్కు తండ్రీ.

అభి—వ॥ ఆహాహా తల్లీ భగవంతుండిట్లు నిర్దయ దలంచినను మన మిందుల కేమి సేయునగును యితరులతో వాదించ వచ్చుగాని

సత్యేశునితో వాదించరాదుగదా.

అ॥ కానున్న కార్యమవని । గాకపోదు ॥కా॥ మేనవాడ నేనుండ బూని నీకీతిబలుడు । విధివీనికి శౌరియున నేమిదెల్పాగదె ॥కా॥

వ॥ అమ్మా నిన్నా బలదేవుండు ధిక్కరించినను కృష్ణ పరంధాము డేమనెనో వక్కాణించుము.

సు॥ సుకుమార దీనికినేమి । సేయనౌను ॥సు॥ ఒకరిపైని స్వాతంత్ర్యమొకరికి జెల్లదంచు । సకలార్థ సాక్షియైన శౌరితానిట్లుబల్కె ॥

వ॥ తనయా కృష్ణ పరంధాముండు బలదేవునితో వాదించలేక నిన్ను నన్ను పాండవుల జేరబొమ్మని ఆవల మీకు జయంబగునని సెలవిచ్చియున్నాడు కావున మనమిచ్చట నుండదగదు

అ॥ కానిమంచిదిజనాని । వేవేగము ॥కా॥ నానలేకాయిటనుండా న్యాయము గాదుయిపుడు । పూనితండ్రిని జేరబోవలె రారమ్మిక ॥కా॥

వ॥ తల్లీ పరంధాని యాజ్ఞ యిట్లున్న మనమిటనుండరాదు పాండుపుత్రుల జేరబోదమురమ్మి ఆవల నాప్రాప్తము.

సు॥ ఘోరాటవీమార్గమున । వేవేగము పోరు సల్పాగవచ్చి పోనిత్తురే రక్కసులు । నేరవు రణముసల్పా నీవుజూడా బాలుడవు.

వ॥ తండ్రీ మనమీ విధంబున యొంటరిగా బోవుచున్న నరణ్యమార్గంబున పాపాత్ములగు రక్కసులడ్డంబువచ్చి రణంబుజేయ యత్నింతురు గాన యేమినేరని పిన్నవాడవు నీవెట్లు వారింజయింతువు.

అభిమన్యుడు

వ॥ ఓహో జననీ నా పురుషార్థమించుకైన నీవెరుంగవే నీగర్భంబుననుండియే రహస్యంబుగ నాతండ్రివలన సకలవిద్యల నభ్యసించినాడ నన్ను జయంచ బ్రహ్మ రుద్రేంద్రాదుల వశంబుగాదు నమ్ముము.

సు-వ॥ అహాహా పుత్రా నీవెంత నేర్పరివి వినను నామనోహరుం జూపగలవా.

అ॥ యెందుకీచింతామదిని । నాతల్లిరో ॥యెం॥ సందేహమేలనీవీ స్యందనమున గూర్చొనుమీ । నందనందానుడౌ మానాల పురీశుడేలు ॥

వ॥ తల్లీ నీవెంతమాత్రము భావంతంబునొంద పనిలేదు యిదేరథంబున గూర్చొనుము యొక్కక్షణంబులో పాండవులజేర దోడ్కొని పోవువాడ భయపడవలదు.

వాగము_సు॥ పారవుత్రిక వేగమూ మీ బాబులున్న చోటికి। యుదరమున నిర్ణయ దలంచి యుండిరీ యీనాటికి॥

వ॥ తండ్రీ పుట్టిల్లుబాసిన నావంటి దురదృష్టురాలీ లోకంబునగలరా యిక నామనంబు నిల్చునెట్లు.

అ॥ ధైర్యముగా విడనాడగూడదె। కార్యసాధనలకుమది॥ ఆర్య సమ్మతి గాదిదీ వాత్మలో భీతిల్లువది॥

వ॥ అమ్మయ్యా శశిరేఖను నాకొసంగక దుర్యోధనుని పుత్రున కొసంగునది సత్యమా కాదు ఐనను నేనా కౌరవుల శతవిధంబులనైన బరి మార్చి శశిరేఖను వివాహంబు జేసుకొందునుగాని విడువను నీవుది యంత పర్యంతము ధైర్యమున నుండవలయును.

సు—వ॥ కుమారా అట్లుండనిమ్ముగాని.

సు॥ యెవ్వరిది యీకాననం। జనులెవ్వీథియె కానీఘనం। యి వ్వసుధ పాలించు ధన్యుని। కెంతగలదో సాధనం॥

వ॥ యింతపర్యంతము వస్తిమిగాని యీయరణ్యంబు దాటునది నశక్యముగానున్నది యిచ్చోటనుండు ఘనుడెంతవాడో వానింజయించి గదా మనమూవలకు బోదగియున్నది యిక యెట్లు తండ్రీ.

అ॥ యెందుకే నీకీభయం। నేజెందగలనే దిగ్జయం। నందనందను డైన యామామావాలహారి నెంచుటెసయం॥

వ॥ అమ్మా నీవిట్లు భీతిల్లవలదు నేనీయరణ్యంబును శర పరంపర లచే ఛేదించి దఘ్నుని జయించెదగాని నీవీ రథంబున గూర్చొనుము.

సు—వ॥ తండ్రీ నేనొక్కమాట జెప్పెద వినుము నేనీ రథంబునకు సారథినై యుండెద రథికుండవై నీబాణంబులచే వృక్షంబులనెల్ల ఖండిం పుచు మార్గంబు చక్కగా చేయుచుండుము.

అభి_వ॥ అమ్మా నీకీ రథసాధ్యము యెట్లులవచ్చెను.

సు—వ॥ నాతండ్రి నాపై కరుణించి నాకీవిద్య గరపినవాడు గాన రథసారథ్యములలో నన్ను బోలు ఘనులు లేరు నమ్మాము.

అభి_వ॥ సరిమంచిది నీవటులనే సారథివిగమ్మ (అని తల్లిని తన సారథిగా జేసుకొని ధైర్యముతో)

అభిమన్యుడు

మత్తకోకిల॥ సర్వలోక శరణ్యుడైతగు। శౌరినీ మదినేదాల

సర్వాతాదులనుగ్రహించేరియు నా సుకక్షీవ్యాసాదులకా । యుద్వైపై బడవైచి మార్గము । నొక్కికీతియు జేసితిరా । గర్వాయుక్తుండవరువచ్చిన । గాని ద్రుంచెదనాజిలోన ॥

వ॥ జననీ మనముపోవు మార్గమిదే చక్కగా నొనరించినాడ రథంబును వేగంబునబోనిమ్ము.

సుభద్ర

వ॥ ఆహాహా పుత్రరత్నమా నీబాహుబల చాతుర్యంబున కేను మెచ్చితిగాని యిదేమార్గంబున కడ్డంబు శూరుడెవండో వీరావేశంబున వచ్చుచున్నవాడు నీ వెంతమాత్రము వెనుదియ్యక వీనిం బారదోలుము

అభిమన్యుడు—వ॥సరి మంచిది రానిమ్ము.

ఘటోత్కచుని ప్రవేశము తెరలోనుండి

వోరీవోరీ మనుజాధమా నిలు నిల్వుము నిల్వుమా.

దర్బారు—ఘు॥ యెవడవురానీ వెవడవు । నన్నెరుగక యీనావనమున భువిలోమదిభీతి లేకపూనివసమాజేరితి వోర ॥యె॥ నావనంబున జేరుటకును నళినసంభవాదులైన । భావమందు వెరతురింత కావరమాయిందురాను॥ —॥ ఖ్యాతిగనినునల్లజీమరీతినలచి వేతురోరి । నాతో బోరబ్రతుకుదె మా నాలపురీశునిసాక్షిగ ॥యె॥

వ॥ వోరివోరి మానవా నీవెంతమాత్రము భయంబులేక నావ నంబంత ఛేదించినాడవు నిన్నిచ్చట సంహరించక విడువను యొక్కక్షణం బిచ్చట నిల్వుంబడుము.

వాదము—అ॥ యేలప్రేలెదురా దుశ్శీలనాదుచాతుర్యము దెలియక నిటు ॥లేలప్రే॥ చాలుజాలునునీకీ సాహసంబుజెల్లదుయిటు । నాలము జేయంగోరినకాలుని పురికని పెదక ॥యే॥

వ॥ ఓరీదనుజాధమా నాపురుషార్థంబు దెలియక నీవిట్లునిర్భయోన్మత్తులాడంజెల్లదు ప్రాణంబుగాపాడుకొని వెళ్ళుము ళ్ళిబల్కిన నీమదంబడంచెద.

ఘు॥ యెంతవాడవురా । బలవంతుడవనిమురియుదుమా నాయెదుట నునీ ॥వెం॥ యింటిని సారథిగాగొని యింతటవచ్చిన నీవిధ । మంత దెలిసె వదురకునీ । వంతటివాడవె యెుగుదువు ॥యెంతవా॥

వ॥ వోరెమానవా నేనేపురుషార్థిననివక్కాణింపుచున్నవైతే పురుషార్థివైన యాదువారలను రథసారథ్యము గొనివచ్చుట రాచబిరుదా ఛీ

నీవంతటివాడవేకాని నావంటికూరుండవుగావు తొలగిపొమ్ము.

అ॥ వాదమేలనురా । యిదికాదుతల్లిదామూల ధనంబగు యీ॥ వా॥ పాదుగజననీజనకుల బాసిచరించునది మర్యాదవిహీనంబని నేనాకార మ్ముగవచ్చితి.

వ॥ వరేదురాత్మా యీశోకంబున నెవ్వరైనను తలిదండ్రుల బాసియుండుట ముఖ్యంబుకాదనవిని యిదేవజ్ఞవని సహాయంబున వచ్చి నాడను యిట్లువచ్చినవారి కెందునైన నవజయంబులేదు నన్నుజయించ నిక నీవశంబుకాదు తొలగుము.

ఘు॥ మేలుమేలటరా యీలీలబల్కుటెలను చాల్ చాల్ పోపో॥ మే॥ బాలుడవీవటు క్షీరపానము జేయుచుబ్రతుకుచు । యీలమునా తోసల్పగజాలవుకామనిచితినిక ॥

వ॥ ఒరేచిన్నవాడ నిన్నుజూడగా తల్లిస్తన్యపాన మిదివరకైన మానవట్టిబాలుండవుగా నున్నావు నిన్నుసంహరించిన శిశుహత్యవచ్చు నట్లున్నది నాతోరణంబుజేయ నేరవు రక్షించితిపొమ్ము.

అ॥ కానిచూతునికా । యోదానవానీధైర్యము శౌర్యముబలము॥ కా॥ భానుసమాన కళాన్విత బాలుడవీవో నేనో । మానక నీరణరంగము లోనెరుగక వచ్చెనుసరి । కానిచూదుమికా ॥

వ॥ వోరెరాక్షసాధమా నన్నుయేమినేరని బాలునిగానెంచి నిర్భయంబుననిట్లాడిపోగలవాడవా నేపుట్టుకతోడనే తల్లిగర్భమువనుండి సకల విద్యలభ్యసించినాడ నాపరాక్రమంబెరుంగవె.

ఘు॥ వింటినీవిధము గనుగొంటినీ ।మానాలవురీశునిసత్కృప। మింటక నెగసినసూయరా । మేమువుజొచ్చిన నీవెంటనంటివిడవక నిన్నొక పంటక నమిలియుమింగెద.

వ॥ వోరెమానవాధమా నీవు తల్లిగర్భంబుననుండియె సకలవిద్యల భ్యసించినావుకాని యేనుజన్మించినతోడనే నానాశస్త్రంబులతోవచ్చినాడ నన్నుజయించ బ్రహ్మాదుల వశంబుగాదు నిన్ననగా నాయొక్కవంటిచే నమిలి మ్రింగెద.

అభిమన్యుడు—వ॥ ఐన రారమ్ము రణంబుజేతము.

వాదము—ఘు॥ రారమానవాధమా । పోరుసల్పవలెనిచ్చట ॥రా॥ యూరకెవాదించుటమేరకాదిలక । జీరివేతునిన్నిప్పుడురా ॥రా॥

వ॥ ఓరే మానవా యూరక వాదించుట ముఖ్యంబుగాదు నీశరంబులచక్కగా నొనగూర్చుకొనుము రణంబు సేతుము.

అ॥ వచ్చెనిదో బాణము వదలకనినుమ్రించు నేడు ॥చ॥ నొంచ్చి నీవీ క్షితిన్ జొచ్చినవిధువర్ వచ్చెలవిశిఖవరిణోకు వచ్చెనిదో బాణము॥

వ॥ ఓరే జానా వాయుదేశరంబుల వేయుచున్నవాడ వీటినెల్లదప్పించుకొనుము నీపురుషార్థము జూచెద.

ఘ॥ వేసితిదో ఖడ్గము । సాగువక నీవిందునిలువు ॥వే॥ ధ్యాసజేసుకొనుమునీ తల్లినీదండ్రిన్ యీ సమయము బ్రతుకబోవు॥

వ॥ ఓరే బాలకా యిదో ఖడ్గంబు వేయుచున్నవాడ నీప్రాణంబు నిలువబోదు మాతాపితృలదలంచుకొనుము.

అ॥ శౌరనీమఖడ్గము । నవలీలం దునిమితినిదో ॥ప॥ శూరుడనని మురయుకన్ । దూరనాడకన్ పాపోర బ్రతుకలేవు.

వ॥ ఓరేనీచా నీవువైచిన ఖడ్గంబును తృణమాత్రంబుగా నెంచి ముత్తునియలం జేసినాడను యికనీ వేసాధనంబునైన జయించజాలవు పాపాత్మా.

ఘ॥ క్రూరశిలావర్షము గురిపింతును నీపైనను । మేరువుతలక్రింద యీ । మేరమీరిరన్ యేటికి నేవెనుకరోయి॥

వ॥ ఇదే పర్వతాది శిలాజాలంబులనెల్ల నీపైకి విసరుచున్నవాడ వీటినెల్ల నెట్లుదప్పించుకొనువాడవో చూచెదరారా ముష్కా.

అ॥ యింతేనా నీబలం । తెరిగింతును నాబలమిక । ద్రుంతు నీశిరం బిదో । చింతజెందకన్ । యెంతుమానాలవాటిని ॥యింతేనా॥

వ॥ ఓరే దురాత్మా నీశిరంబుద్రుంచునట్టి శరంబిదో వచ్చుచున్నది చూడుచూడుము (అని యొక దివ్యబాణంబునవానిమూర్ఛగావించి చూచి తనమనసులో) ఆహాహా యిదెంతయన్యాయముఘటించెను యీఘనుండు నాతండ్రియగు భీమసేనుండుగానున్నవాడు యీతని నొప్పించి నేనెంత పాపినైతి నక్కటా నేనేమిసేయుదు అయిన నాతల్లిని విచారించిచక్కగా దెలుసుకొనియెదగాక (అని ప్రకాశముగా)

అభి—శా॥ అమ్మా యీఘనునెన్న వ జ్ఞనకుడో । యాభీమసేనుండుగా
నమ్మంజూడగవచ్చునట్టులనమా । నంబైనచిహ్నంబులీ
నెమ్మోముంకరముల్ పదంబులు।మహానేత్రంబులుంగాత్రముల్

సుమ్మా మెంతపచారికై తిజనకన్ । స్మృతి-ంవియూఘాతిన్పై ॥

వ॥ తల్లి యీఘనుండు నాతండ్రియగు భీమసేనుడుగానున్నవాడు నేనెంతమాత్రమెఱుంగక యిట్లుజేసి పాపంబుగట్టికొంటిని యికనేమిసేయ నగునూ,

సుభద్ర-వ॥ కుమారా నీవిందుకొఱకై పశ్చాత్తాపంబు నొందవలదు యీతండు భీమసేనుంబోలువాడుగాని భీమసేనుండుగాడు అదెట్టులన్నను.

గీ॥ అతడువజ్రశరీరుండుక్షితలమున । నాతనికిమూర్ఛలేదెందుఁజురసిచూడ
నతనిరూపసమానుండునితడుగాని। భీమసేనుండుగాడుయీభీమబలుడు ॥

వ॥ కుమారా భీమసేనుండువజ్రశరీరుండుగాన రణంబున మూర్ఛా గతుండుగాడు యీ పురుషుండు భీమసేనుండని నమ్మవలదు.

అభిమన్యుడు-వ॥ సరిమంచిదట్లైన రథంబుబోనిమ్ము ( అనిపోవు చున్న మూర్ఛదెలిసి ఘటోత్కచుండు రథంబుకడ్డంబువచ్చి క్రోధంబున)

ఘటోత్కచుండు-వ॥ ఒరెమానవా దొంగవాని వలెనా దిరుంగ బడక వెళ్ళుచున్నవాడవే నిల్వుము నిన్నిచ్చట మర్దించవచ్చినాడ.

వాదం-అ॥ రార దైతేయ రణరంగమునకా ద్రుంతునిక । చోరుడ నుగాను మహాశూరుడను వీరుడను ॥

వ॥ ఒరేనన్నుచోరుడనీభయంబులేక బల్కుచున్నవాడవై తేనీప్రాణంబుబోవుటెఱుంగవుఐనరాకమ్మయిట్టిరణంబునకు భయపడువాడనుగాను

ఘ॥ ఇంతేకదరా నీబలమంత గనుగొంటిభళి । చింతలేదునిన్ను వధింతు క్షణములోపల,

వ॥ ఒరెమనుజానీబలంబుచలంబునాకుందెలునుపెక్కులువాదించక నాశరణుబొందుమా రక్షించెద లేకయున్న నన్నుజయించిపోనేరవు,

అ॥ నాతోబోరా నీకుచేతగాదూ రక్షించితి । ప్రీతివందనమిడ జేతు నునీపై నిదయ,

వ॥ ఒరెమూర్ఖా నన్నుజయింప బ్రహ్మరుద్రేంద్రాదులవశంబుగాదు నీవననాకొక తృణమాత్రంబుగావునశరణుబొందుమా రక్షించెద.

ఘ॥ బింకములుబల్కకురా । సంకటమురానీకిది । సుంతు బాపూదు నీచుట్టములనుబిల్చుకో ॥

వ॥ ఇట్టిబింకములాడియూరికేపోనేరవుయి దేనామష్టిఘాతనీపై కివచ్చు చున్నదిక్షణంబుబ్రతుక జాలవునీతుదాయూదులెవరైనయున్నబిల్చుకొనుము

ఆ॥ చాలుచాలునీ బలసాహసము మెచ్చితిని । శూలాయుధమును వేసితి నేలీల జీవింతువు ।

వ॥ ఇదే శూలాయుధంబు వచ్చుచున్నది దీనినెట్లు తప్పించుకొం దువో చూచెద నిల్వుము.

ఘ॥ ఏలు మానాలపురి నీలవర్ణ డౌహాది । రాలమీదా నిన్నిటు । గూలంగను వైతుధర ॥యే॥

వ॥ ఇదే నాపురుషార్థంబు జూపెద యొక్క క్షణంబు యిచ్చటనిల్వుం బడుము (అని యొక వాక్ప్రిఘాత జేసిన నభిమన్యుండు మూర్ఛిల్లినంత సుభద్ర ధైర్యంబుజెడి కుమారుని పయిబడి దుఃఖించును)

సు వ॥ హాపుత్రరత్నమా ! ఇచట నీకెంత గతివచ్చెరాతండ్రీ.

దరు-వ॥ నాసూనా జూణాయీ సమయము మోసపోతివా । దోసమేమి యధికంబునే జేసియుంటిరా । వ్రాసె నీనుదుటను యిటులవాసి మీరగా ॥నా॥ శౌరి వలననంగను యుపచారినై యిటక । జేరితినినువీరితి యే దారిబోదురా ॥౨॥ చిన్నతనయ యాత్మతి సినుగన్నతండ్రి యిదివిని తా । నెన్నరాని దుఃఖముచే చిన్నబోవురా ॥నా॥ రక్కసునీ వలలోపల జిక్కియున్న మనకెవ్వరు । దిక్కయిప్పట బ్రోతురు నేదీనురాలరా ॥నా॥ ధారుణీ మనాలపురి ధాముని కారుణ్యమిటుల । జేరెను యిక నేనేమి నేయవానురా । నా సూనాకూనా యీ సమయము ॥

సు-మ॥ తనయా నిన్నెడ బాసిపోవ మదికిక । ధైర్యంబగుకనెట్లు పా । యనిదుఃఖంబున కెట్టులోర్వ నగుచా । యాదుల్ నసుకగాంచినా తనయుండేడి యటంచు నన్నడుగనా । తండ్రేమనీ విన్నవిం । తునుసిగ్గింతయు లేక నీయవనియం దేనెట్లు జీవింతుహా ॥

వ॥ కుమారా నిన్నింట నుండనీక యిచ్చటికి దెచ్చి నిర్జీవితునిగా జేసిన నావంటి పాపిష్ఠి యీలోకంబునగలదా అక్కటా నిన్నెడబాసి యొక్క క్షణంబెట్లు బ్రతుకనగురా తండ్రి. (ఘటోత్కచుండు తనలో)

వ॥ ఏమీ యీపురుషుండు నాతండ్రియగు యర్జునుడుగా నున్న వాడే యీమె కుంతియేమి అయిననిట్టి ఘోరారణ్యమున కేలవత్తురు కాని వీరి వృత్తాంతంబంతయు పూర్ణముగా విని యెదగాక.

దరు-సు॥ యేమినేతు దైవరాయా।యేమీదోచాదూనీమాయా। యీమా మొరాలించా కొంతేయ । మధ్యమాండేల రాడాయ ॥యే॥

ఘటోత్కచుండు తపస్వి

ఘ—వ॥ ఆహా యీసాధ్వీలలామ కుంతీ సుత మధ్యముడగు యర్జునుని ధ్యానించు చున్నది యీమె సుభద్రా దేవియా యేమి కాసికాని యింకా స్పష్టంబుగ దెలుసుకొనియెద.

సు॥ మామజాడమాకనేల । మనుజ నాథులడవికేల । యోయి మమ్ములమరువనేల । పుత్రునిక కీర్తిగాంచ నేమి ॥

ఘ—వ॥ ఓహో నాతండ్రులగు పాండవులు మాయాజూదంబున నోడిగదా యరణ్యము ప్రవేశించినవారు యిది సత్యము యీమె సుభద్రయో ద్రౌపదియో తెలియదు యింకా చూచెద.

సు॥ ఘోరుని మానాలపురి । ధామనన్ను బోవుకోరి । కారాణ మింతాయెభారీ । నేమేమిదైర్యరి ॥

వ॥ హానాముద్దుల కుమారా నిన్నుబాసిన నాకు దిక్కేది (అనిచింతించుచున్న ఘటోత్కచుండు)

తపస్వి—వ॥ ఆహా యీ సాధ్వీలలామ మహా సత్యవంతురాలుగా నున్నది యిట్టి పుత్రదుఃఖమున కోపించి నాకేమైన శాపంబొసంగిన నేనెట్టు లోర్వగలను ఈమె దుఃఖోపశమనంబుగా నొక మాట బల్కెద (అని ప్రకాశముగా)

ఘటోత్కచుండు

గీ॥ అమ్మనీవెవ్వరో నాదుయాన తెల్పు। పూనిసాష్టాంగవందనంబులనొనర్తు పుణ్యవంతురాలమీరౌటపూనిమెరుగ। కేనుయుపచారినై తిక్షమింపుతల్లి॥

వ॥ అమ్మా నీవెవ్వరోస్పష్టంబుగాబల్కుము నీకిదే సాష్టాంగ వందనంబులాచరింపుచున్నవాడ తప్పుక్షమించవలయు.

సు—వ॥ అయ్యా నావృత్తాంతంబు నేమని చెప్పుదాన.

గీ॥ నావిభుండర్జునుడు నరనాయకుండు। రామకృష్ణులు సహోదరు లిమ్మహిపయి । నేసుభద్రను యిలవీడు నాసుతుండు । పేరు యభిమన్యుడని యిలబిల్తురయ్య ॥

ఘటోత్కచుండు—వ॥ ఆహా తల్లీయిప్పటిమాట మళ్ళీబల్కుము.

సు—వ॥ ఏను అర్జునుని మనోహరినగు సుభద్రనునాయన్నలుబలరామ కృష్ణులు నీ చేహాతుండైనయీబాలుండు నాకొమారుండు యభిమన్యుండు మేమిర్వురము గూడి పాండవుల జేరబోవు చున్నవారము తండ్రీ.

న॥ హానామద్గళపోదరా (అని పయింబడి దుఃఖించును)

దరువు॥ హాసుకుమార రహాతాసోదరాగ)నే । హాసుకుమారా మోసమయ్యెనా ॥హా॥ యింతకార్యమును నే మాత్రమెరుగకతమ్మాచింతించగగలవ లెనాయంతటిపాపాత్ముడిలలో ॥హా॥ కన్న తండ్రి యిదివింతా నెన్నరాని దుఃఖముతో । చిన్నబోయి శోకముతో । నన్నేమని దూరునో కా॥ పాపపుయీచేతులకా తావమొందిజేసితిహా । యీపృథివినినిన్ను బాసియేపగిదిని జీవింతును ॥హా॥ తమ్ముడనీతో నుగూడితక్షణమునవత్తు చూడు యిమ్మహిమానాలపురి యీశుడెరక్షించునికా ॥హా॥

వ॥ హా సోదరా నిన్నెడబాసి నేనొక్క క్షణంబునిల్వజాల యిదే నీతో వచ్చువాడను అని ఖడ్గంబున గొంతు నరకుకొను సమయంబున సుభద్ర)లేచి హా స్తంబులుబట్టి.

సు-వ॥ ఆఆః యిదియేమన్యాయము.

వాదం-సు॥ యెవరయ్యా మీరూ । యేలా మీకీదుఃఖము ॥యె॥ యెవరి కొమారుడా వింతేల చరించెదావు । సవినయమూనా సరగునదెల్పుమీ॥

వ॥ అయ్యా మీరెవ్వరో యీబాలుని పయింబడి సోదరాయని దుఃఖింపుచు ప్రాణత్యాగంబేల జేసెదవు విన్నుగన్న తలిదండు) లెవరో వక్కాణింపుము.

ఘు॥ ఓతల్లీ నేను ఘటోత్కచుండను వినూ । నీమినేతు నేభీమ సేను పుత్రుడను । పాలకుడానా పాలింపుపాలింపు ॥౨॥

వ॥ అమ్మా నేభీమసేనుని కొమారుడనగు ఘటోత్కచుండను నా తల్లి హిడింబి నేనెంతమాత్రము మీరని దెలియుక నిట్లు మోసపోతి నా తప్పు క్షమించుము.

సు-వ॥ హాపుత్రా ఘటోత్కచా మనకెంతగతివచ్చెరాతండ్రీ.

ఘు-వ॥ అమ్మా యేమిసేతము.

సు॥ దైవము యింతనిర్దయ దలచెనాహా ప్రావీణ్యముగను మనల పాలించు వారెవ్వరు । యేవిధిదోచదింకేమి దోచదుపుత్ర ॥

వ॥ కుమారా ఘటోత్కచా యిందుల కేమిసేయునగునురా తండ్రీ యీ బాలుండు పునర్జీవితుండగు నెట్టులో తెలియదు.

ఘు॥ జననీ యీ దుర్యోధనుడింత జేసెనాహా । జనకుల కింత కష్టముకు సంఘటించెవాని । దునిమెదయూజ్ఞ నాకు నేడొసంగుమిక ॥

వ॥ జననీ అట్టిపాపాత్ముఁడగు దుర్యోధనుని వలనఁగదా మనకింత ఆపత్తు సంభవించినది యాపాపాత్ముని వధించినచ్చోవ సెలవొసంగుమా.

సు॥ అఁఅఁ యిదెంతమోసము సర్వశక్తిమంతులగు మనవారెల్లను నుండఁగా నీకిట్టిసాహసంబుగూడదు నా మాటవినుమా.

సు॥ కానున్న కార్యము కాకతీరాదుభువి ॥కా॥ శ్రీనివాసూడీకీర్తి బూనినతామెచ్చునే । న్యాయమవ్వునంచు సూరులు ॥

వ॥ కుమారా మనపాత్రతంబుమన నిట్లుశ్రమలబడజేయుచున్నది గాని దుర్యోధనుండేమి జేసినదిలేదు సర్వజనులకు శాంతచిత్తమే జయంబగునని యూరోకని యుండవలయు.

ఘు॥ ఏలః మానాలా యీశుశ్రీశుడు । బాలుడుజీవించుట యేలీల నోనేదెలియ । జాలనునేదు వో జననిరో తెల్పాగదె ॥యె॥

వ॥ అమ్మా అదంత నట్లుండనిమ్మాగాని యీబాలుండు పునర్జీవితుండగు యుపాయం బెట్టులో యాలోచింపుమా.

♦ సు భ ద్రి ♦

గీ॥ అవఘునేనుపతివ్రితనాదునేని । ధర్మతనయుండు సత్యంబుతప్పడేని । అరయకృష్ణుడుపరమాత్ముఁడయ్యెనేని । జీవితుండగు నీబాలశేఖరుండు॥

♦ ద ర్వ ♦

గోపాలాబాలా । కోపముదేలా । యీ పాపనేల । యేతెంచవేలా॥ గో॥౮॥ నీవెదిక్కంటి । బ్రోవారమ్మంటి । దేవానీవంటిదైవమేడంటి॥౨॥ మానాలపౌరి । ౼ ధుదానవారి । నేనిన్నుకోరి ధ్యానింతుమారీ ॥గోపా॥

వ॥ దేవా జనార్దనా దీనురాలనగు నన్ను కటాక్షించి యీబాలుని జీవింపజేయుముతండ్రీ (అనివేడుచున్న నభిమన్యుడు నిద్రబోయి మేల్కాంచువానిభంగి లేచి క్రోధముతో )

అభిమన్యుడు వ॥ ఒరెఒరె రాక్షసాధమా నీవొక్క క్షణంబిచ్చోట నిల్వబడుము నాశరజాలంబుల నిన్ను సంహరించెద.

సుభద్ర–వ॥ ఓహో కుమారా యభిమన్యా నీవెంత మాత్రమీ ఘనుండన్యుడని దలంపవలదు భీమసేనుని కుమారుండగు ఘటోత్కచుండు నీకగ్రజుండుగావలయు గాన నమస్కరించుము నీవని యెరుంగకిట్లు జేసినవాడు గాన దోషంబులేదు.

అభిమన్యుడు–వ॥ అహోహో తల్లీ నేటికిగదా నాయన్నను కన్నులార

గనుపట్టి భాగ్యము సంధవించినది సరి మంచిది నేనట్టులనే యిమ్మహాత్ము
నకు నమస్కరించెద.

ఆ॥ అన్నా వందనములొసగ । యన్నా నన్నేలుమిపుడు యదవాధిపనే
నెన్నో భంగుల వేఁడితి । నిన్నాడితి నిందించు నేరాగకనిచట ॥

వ॥ అన్నయ్యా నీ దేకవందనంబాచరించుచున్నాఁడ కటాక్షించి
నాతప్పు క్షమించుము యదవాధిప.

వాదం-ము॥ రారా యనుజ యిటుజేరా । నానేరము లెన్నకు శూర ।
క్రూరుడనై దెల్యకను । నిను గొట్టితి పాపాత్ముఁడను । దయమీరి యుం
డవలెనికనూ ॥యికరారా॥

వ॥ సోదరా యిటురమ్ము నీవని నేయుంగక నిన్నింతో మోసపుచ్చితి
నాపై నిర్దయ దలంచవలదు.

అ॥ అన్న నిన్నిచ్చట గాంచినే । నానందించితిపొండి। విన్నవింతు
నేమనియు । గానున్న కార్యమేమియు । మదినెన్ను టేమి యిదిపురియు ॥

వ॥ అన్నయ్యా నీ మది నావిషయంబు భావంతంబు నొందకుము
యిదికానున్న కార్యంబుగాఁ నీయందేమి దోషంబులేదే.

ఘ-వ॥ సరి మంచిది

ఘ॥ మీరిచ్చటికి రానూ। యేకారణమో దయతోను । కోరిదెలుపు
మిలలోను । కోరిక దీర్చియేను । యీసారి విన్నవుదవాను॥శ్వార॥

వ॥ అనుజా మీరిట్లు శ్రమల పడుచు గృహంబు విడిచి యీ యర
ణ్యమునకు వచ్చిన కారణమేమో వక్కాణించుము మీకోర్కె నెరవే
ర్చెదను.

అ॥ సీరపాణి తనసుతను। దయమీర మాకొసంగకను । కౌరవేంద్రు
నకు నివ్వ । మదిగోరె జనంబులు నవ్వ । యీసారిజేసెము మురవ్వా॥ము॥

వ॥ అగ్రజా ఘటోత్కచా యీ బలభద్రుండు శశిరేఖను మాకొసం
గక దుర్యోధను పుత్రునికిత్తునని యత్నించినాడు కావున అచ్చటుండ
ముఖ్యంబుగాదని పాండుపుత్రుల జేరబోవుచున్నారము మహాత్మా.

ఘ॥ కానిమ్మాత మదినెంచి । యా కౌరవేంద్రుసటుదుంచి । యే
ను యాసతినిదెచ్చి । నీకిత్తు నావాసము హెచ్చి । మదమూని యుండు
మది మెచ్చిభళి ॥కాని॥

వ॥ తమ్ముఁయ్యా మీరెంతమాత్రము భావంతము నొందక యిదే

మద్గృహంబున నుండుడు యేనుబోయి కురువరులనెల్ల తెగటార్చి యా శశిరేఖను దెచ్చి నీకిచ్చెద నమ్మామ.

అ॥ కనిఁణించును మానాలా। యాకదివరమందు సుశీలా। అకయు మేమా మీయాజ్ఞ। మదిమరువఁగాము వోప్రాజ్ఞ। నీకెరుక జేసితిగుణసంజ్ఞ॥

వ॥ అన్నయ్యా మేమటులనే మీసన్నధిని యుండువారము గాన మీయత్నంబున మీరుండుడు.

ఘ—వ॥ సరిమంచిది ( అనిజనమేనమామయగు జాగిలి మామను బిలచి ) హే జాగిలిమామా యిటురమ్మా.

జాగిలిమామ వాక్యం

వ॥ హేఘటోత్కచా యేమివిచారము.

వాదం—ఘ॥ మామవినవె నేడిక బలరాముని ప్రియసుతనిక॥ భీమ విక్రమమునదెచ్చి। యీ మహాత్మునకీవలెగా॥

వ॥ జాగిలిమామా యీ నాతమ్ముడగు అభిమన్యున కాబలభద్రముని పుత్రికయగు శశిరేఖను దెచ్చియిచ్చి వివాహము గావించవలె పోదము పరియాణము గమ్మా.

జా॥ మంచిది మనమిటుల జనుట యెంచని కార్యంబిది। యించుక యాహరివిక్రమ మెవరివశము గానిది॥

వ॥ ఘటోత్కచా మనమిట్లు జని యాదవుల జయింపజాలము మాయావేశంబులతో బోయి శశిరేఖను దేవలయును.

ఘ॥ భళిభళి నీవానరించు యుపాయమునకు మెచ్చితి। వలదు యాసల్య మిచట దెలిపితి నేయిాస్థితి॥భ॥

వ॥ అహాహా మామా నీయుపాయంబునకు నేమెచ్చినాడ గాని మన మేవిధంబున బోవలయునో దెల్పుము.

జా॥ స్త్రీలవేషమును దాల్చి చెలువుగ నటబోవలెగా। మేలగు మానాలశౌరి బాలనిందు దేవలెగా॥

వ॥ ఘటోత్కచా మనమిప్పుడు మహాసౌందర్యముగా స్త్రీలవేషంబులతో బోయి మృషనేత యకాంతను దేవలెగాని హరిచక్రముచే పాలింపబడుచున్న ద్వారకా వాసుల జయింపరాదు కావుననేనాయుపాయంబంత జెప్పెదరమ్మా.

ఘ—వ॥ సరి మంచిదిరమ్మా. (అని పోవుచుందురు)

* దుర్యోధనసభ *

దు॥ దుర్యోధనమహారాజనూరా । సద్గుణైశ్వర్యశౌర్య ధైర్యమానస । దుర్యో॥ ఆర్యుల్ మెచ్చ సాహస నర్పులంచయినజయించిన । సూర్యనిభుం డను మహాసౌందర్యశేఖరుడను ॥దు॥ శ్రీలోలుని చెపరా । మానాలపోరి వాసుడాయుటాశీ ) । బాహుబలంబుగ మచ్ఛా జాలంబులతో వైరులదూలం దోలిన నృపశార్దూలుడ ధాత్రీపాలయశ ॥దు॥

వ॥ ప్రధానిశేఖరా

ప్రధాని–వ॥ కింభో రాజపదీపా.

దు–వ॥ మనరాష్ట్రంబున యావజ్జనంబులు మదీయపరాక్రమమే కొనియాడు చుందురుగదా.

ప్ర–వ॥ హే రాజన్ యీపురి జనంబులుమీరను విధంబుననే వర్తింపుచున్నారు గాని యహితంబుగాలేరు సమ్ముడు.

దు–వ॥ సరి మంచిది ( అంతలో ద్వారకనుంచి సేవకులు శుభలేక దెచ్చియిచ్చుదురు )

సే వ కు లు

హే దుర్యోధన చక్రవర్తి మా బలరామదేవుండు మీకిదే శుభ లేఖ బంపినడు గైకొనుండు.

దు–వ॥ ఏది యిటుదెమ్ము (అని తీసికొని చదివి సంతోషముతో) అహాహా మంత్రిపుంగవా నేడెంత సుదినము బలభద్రుండు తన పుత్రికను నా పుత్రున కిత్తునని తలంచి శుభలేఖ బంపినడిదో చూచితివా యిట్టి వియ్యముతో సమానము యెందునైన గలదా.

మంత్రి–వ॥ రాజోత్తమా అట్టులైన మన మిప్పుడె పరివార యుక్తముగ శీఘ్రంబుగ బోవలయు శుభస్య శీఘ్రంబను శాస్త్రోక్తి యున్నది గాన యాలస్యంబు గూడదు.

దర్వు–దు॥ పోదామా మంత్రివర । మోదమున వాదించగా వైరి యూధంబు వచ్చిన సాధించిదుంతునూ యోధాగ్రేసరుడ ॥పో॥ మానాల పురీహరి రక్షించు మహాసీశులెల్లా విధానముగా నేడుపూనీ। యాశీర్వాద మున్నిచ్చుచురాగ ॥పో॥ (అనుచు ద్వారక జేరంబోదురు)

రేవతీ ప్రవేశము – దర్వు.

గోపాలాబాలా రేవతి నేనుశిలమానసినే। నేలావణ్యవిశాలనేత్రినే నీలవేణినే ॥గో॥ యింతీన చామంతీ పువ్వులబంతీనేసతి । యెంతోనా

ప్రియకాంతునిఁగని సంతసింతునే ॥గో॥ యేంబానఁ మానాలక్ష్మి హరి
చాలసుదమున । మేలూశ్రీగతి లాయెుష్ట సుశీలలామనే ॥గో॥

వ॥ నెచ్చెలీ మన శశిరేఖ వివాహంబునకై దుర్యోధనులవారు
యింకా రాకయున్నారు కారణంబేమా తెలియదు

చెలి—వ॥ అమ్మా రేవతీమణి పెండ్లివారు రాకపోయిరని ధావంత
పడుటేలను యిదివరకేవచ్చి మన శృంగారవనంబున ప్రవేశించియున్నారు
అదో మంగళవాద్యంబులు వినంబడుచున్నవి.

రే—వ॥ సరి మంచిది (అంతలో స్త్రీల వేషంబుతో జాగిలిమాయ
ఘటోత్కచులు వత్తురు) మాయాంగనలు.

శృంగారవతులము క్షోణీ వినతులము సుందరీమణి । వోసుందరీమణి
బల్ మందగామినీ । బంబా వేషీఘనంబూరివుల మాయంబూ జేతుమె ।
మాయంబు జేతుమె । చిత్రంబుజూతుమె । మానాలపురి నీధానాచ్యు
తుడు మముపూనీ బ్రోచునె । మము పూని బ్రోచునె । ముదమూన
జూచునె ॥చెలీశృం॥ (యిట్లు వచ్చుమంతగా రేవతీగాంచి)

వ॥ సఖిమణి యిటువినుము,

చెలి వ॥ అమ్మా యేమి విచారము.

రే—గీ॥ ఎవ్వరీసుందరీమణు లివ్వసుధను । దేవకాంతల బోలుచుహో విలాస
మునసుయిచటికిని రానుపనియ దేమో యెంతభాగ్యమొసతులనేనిందుగంటి॥

వ॥ సరి మంచిదిగాని నేనీ సుందరులెవ్వరో తెలుసుకొనియెద అని
యెదుర్కొని అమ్మామీకిదే నమస్కరింపుచున్నదాన కటాక్షించుడు.

మాయాంగనలు—వ॥ తల్లీ మీరు రాణివాసస్త్రీలు యిట్లుమాకునమ
స్కరింపవలదు మేమే మీకు నమస్కరింతుము గైకొనుండు.

వాదం—రే॥ ఎవరమ్మా మీరిచ్చటికి । విచ్చేయుపని । వివరించుడీ
యెప్పటికి । సవినయముగా మీరెచ్చట నుండువారో కాని । దివిజులలో
భువిజులలో మీ తేడంబుగనవింతాయె ॥ఎ॥

వ॥ అమ్మా మీ రెవరో స్పష్టంబుగ దెల్పవలయు,

మా॥ దుర్యోధనుని వారము । దాసీజనులాము । కార్యసాధన నేర్పె
ల్లాము । అర్యసమ్మతిగాను మీయుండకు మారాజేంద్రు । భార్యబంపెను
యెుక్క కార్యమునకై వచ్చిందు ॥దు॥

వ॥ జననీ మేము దుర్యోధను నంతఃపుర దాసీలము ఒక్క పని

కయ్యె మీవద్దికి మాకాంగన మమ్ము బంపిన వస్తిమి.

రేవ :- (తనలో) ల_వ! ఆహాహా సుభోద్రదనుల వారి దాసీజనంబులే యింత విలాసముగా నున్నవారె అంతఃపుర స్త్రీలు యింకా యెంతలావ ణ్యవతులో తెలియును ఐన నాకొమార్తె భాగ్యంబింతని చెప్పరాదు సరి ప్రకాశముగా హే కామినులారా.

రే॥ అదియేమి పనిమోవచించా । కోరినదాన మదికేలనూ సంశ యించా । వదలక డెల్లుడీ యావార్తవేవేగనాతో । ముదమున దీర్తునే మీమదిగలుగు కోరికెల్ల ॥అది॥

వ॥ హే సుందరీ మణులారా మీరు వచ్చినట్టి కారణ మేమో వక్కాణించుడు మీపనులెల్ల నెరవేర్చెద

మా॥ పరగకూర్మిసుతను । మమ్మొదోడ్కొని మా । దొరసాని యమ్మనెను । పరగుచిదనరునట్టి వస్త్రభూషణాలంకృత । నిరవుగజేసీ మళ్ళీత్వరలో దోలింతుననియె ॥ప॥

వ॥ దేవి నీప్రియపుత్రికయగు శశిరేఖను వస్త్రభూషణాలంకృతను జేసు మాదొరసానిగారు దోడ్కొని రమ్మని మమ్మంపుత్తెంచినవారు కావున మీ శశిరేఖను త్వరగా మాకొసంగుడు మళ్ళీదోడ్తెచ్చెదమా.

రే॥ మంచిదటులయిన సరెనూ । శశిరేఖనిపుడె గొంచుబోండీ మీరికాను । అంచితముగ మీవారియాజ్ఞకు వేరులేదు । పొంచిమళ్ళిమీరు మా పొలతినిదోడ్తెండిక ॥

వ॥ హే కామినులారా మీరన్నట్టులనే శశిరేఖ నంపించెద గాని మళ్ళి శీఘ్రంబున దోడ్కొనిరండు యాలస్యంబు జేయవలదు.

మా॥ మానాలపురీహారినీ । నమ్మినావారూ । శ్రేయోనిధులౌదురు వనీ! మానినీమణిరోనేడు మాకోర్కె సఫలమయ్యె ।పూనీసంతసముతోను పోదుముయాజ్ఞవ్వుమి ॥ఓ॥

వ॥ అమ్మా మేమిదే శశిరేఖను గొంపోవు చున్నవారము సెల వొసంగవలయును.

రే_వ॥ సరి వెళ్ళుకొనుడు ( అంతలో శశిరేఖను యరణ్యంబులకు దెచ్చి సుభద్రకిత్తురు ) ( ఘటోత్కచుండు )

వ॥ జననీ సుభద్రా మేమిదే శశిరేఖను దెచ్చినారము యభిమన్యు నకు వివాహంబు గావింతమురమ్మా.

సు-న॥ ఆహాహా కుమారా ఘటోత్కచా నీనేర్పరితనమునకు యేను మెచ్చితిని వివాహంబునకు విప్రోత్తములను రావించుము.

ఘ-న॥ సరి మంచిది హే విప్రోత్తములారా ఋషీశ్వరులారా రండురండు. నారదుని ప్రవేశము.

న॥ ఓహో ఘటోత్కచా భళీభళీ వివాహసంబున కేను మెచ్చితి సుముహూర్తంబున కిదియే సమయము శశిరేఖను యభిమన్యునకు పరిణయంబు జేయుదము.

శశిరేఖాభిమన్యుల వివాహము.

శ్లో॥ తదేవలగ్నం సుదినం తదేవ । తారాబలం చంద్రబలంతదేవ
విద్యాబలం దైవబలం తదేవ । లక్ష్మీపతే తేంఘ్రియుగంస్మరామి॥

ఘ-న॥ జాగిలిమామా నేను పానము జేయు యత్నము సిద్ధించెను గాని మళ్ళి ద్వారకాపురంబునకు శశిరేఖను గొంపోవలయుఁగదా యిట్టి శశిరేఖను నేనద్యాక నీవు ముందటి స్త్రీవలె నావెంటరమ్మా పోదము.

జా-న॥ సరి నేనట్టులనే వచ్చెదనమ్మా (అనిపోయి శశిరేఖయగు ఘటోత్కచుని రేవతికచ్చి యేమందురు (ఉమ్మా రేవతీరత్నమా శశిరేఖ నిదే చేకొనుము (అవి వెళ్ళుదురు ఉంతట)

మాయాశశిరేఖ తల్లితో-ద॥ ఆకలి యగుచున్నదే జననీ । అరసి మిమను తాళనే భుకినీ । యీకాలము నాకన్నమిడు । లేకున్న విరోధింతు కడు ప్రాకటముగ నను బ్రతిమాలివవిన॥

వ॥ అమ్మా నాకెంతో ఆకలౌచున్నది ప్రసాదంబొసగుము,

రే॥ బాలికా నీవిటులనుచేల । ఫలహారము దినుపోచాల । విూలీల హాటంబును విడుమ । తాళియుండుమె యవుముదమా । వాలాయంబు వివాహము దనుకను ॥బా॥

వ॥ బాలికా వివాహంబు యైనంతవరకు భుజింపగూడదు కావున ఫలహారంబు జేయుపొమ్మా.

శ॥ ఫలహారము లేదే యచట । చలమేలనునాప్రైయిచట । యిల దేవతలెల్లనువంట । వెలయుజేతు రావలయుంట । చెలగి యిసుమంత భుజించి వత్తునిక ॥ఫ॥

వ॥ అమ్మా నేనెందుబోయిన ఫలహారంబు యగుపడుట లేదు. ప్రసాదంబు గుడిచి వచ్చెద.

తే॥ కావలయు వివాహము నీకు । ఘటిలు తాళు హారినీసాకు । వో వారిజనేత్రరో యువతుల యోర్చకున్న మెత్తురయిలలో । పావనమగు నాపలుకులు మేలగు ర।

వ॥ తల్లీ యెన్న కుశని యాకలి నీకిట్లులగుచున్నది చిత్రంబేమో తెల్యదు కాని యొక్కఘటియ తాళవలయును.

శ॥ చూచితత్తు నేనీవాక్షి । మాచితంతనిందునేనీకుక్షీ । దాచవలదు నాకునుసిగ్గు । దాచకున్న యాకానెయెగ్గు । యోచనంతనే యొనరించెదనిట॥

వ॥ జననీ ప్రసాదంబు భుజించి కుక్షీనింపుకోకున్న కన్నులార నైన జూచి మనస్సు దీర్చుకొని వచ్చెద సెలవొసంగుము లేకున్న నీవెంత జెప్పి నను నేవినను.

తే॥ మానాల పురిహరి నిన్న నన్నించును మరువనిన్ను । నేనెంతి టుజెప్పినవినవు । యేనేర్పును నీమదిగనవు । మానక నెనేమానో తెల్యదు॥

వ॥ సరి నీవట్టులనే వంటశాలకబోయి చూచిరమ్ము గాని భుజించి రాకుము తల్లీ. (అంతలోపోయి)

వంటశాల విప్రులు శశిరేఖా

శశి—వ॥ హే బ్రాహ్మణులారా మీరిచ్చోటుండక వెళ్ళుడు.

విప్రులు—వ॥ అమ్మా శశిరేఖా నీమాటలకు పోవువారము కాము.

ఘటోత్కచుడు ప్రత్యక్షమై

మత్తకోకిల॥ ఈవిధంబున నన్నెరుంగక నేల మీరు మదాంధులై । కావరంబున మాటలాడిన గాతునే మిమ్మిచ్చటక । యీవసుంధరయందు మిమ్ము వధింతుజూడుము ఘట్టిగక । కావుమంచు నుతించివేడిన గాని బ్రోచెద మిమ్ములక॥

వ॥ ఒరే విప్రులారా నాపరాక్రమ మెరుంగక నిట్లాడినబోనిచ్చు వాడనే నిలు నిల్వుడు మిమ్మిచ్చట మర్దించెద.

విప్రులు—వ॥ అయ్యా మీరన్నటులనే వెళ్ళువారముగానిమామెడ క్రోధంబుంచకుడు (అని వెళ్ళుదురు) అంతట ఘటోత్కచుండు నచ్చటున్న అన్నంబంత భుజించును.

బల—వ॥ ఓహో దుర్యోధన చక్రవర్తీ మీరు మీవారికెల్ల క్షేమ మేకదా.

దుర్యో—వ॥ దేవా మీకరుణాకటాక్ష వీక్షణంబున మే మెల్లరము

క్షేమమే యన్నాదము గాని సుముహూర్తము సమీపించినది శశిరేఖా
రావింపుము వివాహము గావింపవలయును.

వ॥ సరి మంచిది యిదే శశిరేఖవచ్చినది లగ్నము గావింతము.

మాయాశశిరేఖ లగ్నము.

శ్లో॥ తదేవలగ్నం సుదినం తదేవ । తారాబలం చంద్రబలం తదేవ
విద్యాబలం దైవబలం తదేవ । లక్ష్మీపతేతేంఘ్రి యుగం స్మరామి

విప్రులు—వ॥ లక్ష్మణా చిన్నవాడా యిదే జిలుకర బెల్లము యీశశి
రేఖ శిరంబున నిడుము (లక్ష్మణుడు జిలుకరబెల్లముపిల్లశిరంబునయుంచిశశిరేఖతో)

వ॥ హే బాలికా యిదే జిలుకర బెల్లము నీ భర్తాళుని శిరంబున
యుంచుము. (అనిచెప్పినంతలో ఘటోత్కచుండు జిలుకరబెల్లము బాలుని
శిరంబున యుంచి యొత్తేవరకు బాలుడు పాతాళంబుకు కృంగబోయిన
జూచి దుర్యోధనుడు క్రోధించి)

దు—వ॥ ఆహా యిదయేమి యన్యాయము యీ బాలిక మనుష్య
మాత్రురాలుగాదు యెవ్వడో రాక్షసుండుగా నున్నాడు హే బలభద్రా
యీ బాలిక యెవరో.

ఘటోత్కచుండు ప్రత్యక్షమై వ॥ ఒరే దుర్యోధనా యేను ప్రత్య
క్షంబుగ వచ్చినను మీరెల్ల పారిపోగలవారని మాయావేషంబుతో వచ్చి
నీకొమారుని వధించి మిమ్మిచ్చట దొరకించుకొని బాధించి చెరబెట్ట దలం
చిన ఘటోత్కచుండను యిదే నన్నుగనుము.

వాదరు. దు॥ రారదానవాధమా పోరుదూరభారమా। పోరుసల్పవేగనిన్ను
జీరివేతు నిచ్చటన్ ॥రా॥

వ॥ ఒరే ఘటోత్కచా బ్రతుకు జీవమాయని నీతల్లి దండ్రులగు
పాండవులు యరణ్యంబున జేరి బ్రతుకునట్లు నీవాయరణ్యంబుననుండి బ్రతుకక
యూరుండనని వచ్చితివిగాని నీప్రాణంబుగొను యెరుంగవు సరి రారమ్ము.

ఘ॥ దొరికితివిర చేతికి వెనువరోరి పాతకీ। మురియబోకు మిందు
నిన్ను గొరికి చంపి వేసెదన్॥

వ॥ ఒరే దుష్టాత్మా పరమ పుణ్యులగు పాండవులతో మాయా
జూదంబాడివారినల్ల బాధించుచున్నదియెరుంగుదుగాని జనకునాజ్ఞలేకనిన్ను
సంహరింప నొల్లకున్నవాడ అయిన నన్ను జయించి పోగలవాడవా.

దు॥ చాలురోరి బింకముసాగదు నీశౌర్యము। పాలుమాలిబల

యెవ్వడేమి చేసెనో కదా యిక నేనేమి సేయుదు.

కృ॥ నేనేమి సేతునయ్యా నాథ। గానేమయ్యవ్రాలోక। జ్ఞానదనీవు లోకా। ధీనుండవీవు ధర్మ। మానసిం బెట్టలాడ కన్నయ్యానేనజ్ఞాడ ॥నే॥

వ॥ అన్నయ్యా యేమి సేరవి చిన్నవాడ నాకేమి తెలియునని నన్నిట్లు నిందించబాడి యా.

బ॥ ఎన్నాళ్ళునాకిపెంచి। యున్నట్టివాడవాంచి। మెన్నాడయినా యొక ఘడియా। యున్నానే పుత్రివిడచి। కన్న కడుపెట్టులోగా చిన్ని తమ్మయ్యనేడు ॥య॥

వ॥ ఏదియైనను నిన్న దూరసానుగాని నీవుదప్ప నాకెవ్వరాప్తు లున్నారు నీవిట్టి కౌటిల్యంబున బల్కినను నాపుత్రిని విడిచినన్నొక్కఘడియు తాళగలనా.

కృ॥ కానున్న కార్యమిలలో। కాకాతీరు నెయ్యడలో। మానాల పురివారుడా నేనయ్యా మీ యాజ్ఞ। లోనుండిగాని యిటులానంచునే నెరుంగ ॥కానున్న॥

కృ-వ॥ అన్నయ్యా మీరిట్లు దావంతంబు నొందనేటికి మనశశిరేఖ యెవ్వడు గొనిపోయెనో విచారించెదము ఘడియ తాళుకొనుము.

నారద ప్రవేశము— వ॥ కృష్ణా యిదే నేజేయు యత్నంబంతయు సిద్ధించినది శశిరేఖాభిమన్యులకు వివాహంబైనది.

కృ-వ॥ స్వామీ యతీశ్వరా శశిరేఖాభిమన్యులకెట్లు వివాహంబైనది మీరుంజేయు యత్నంబెట్టిదో యతిచిత్రంబుగానున్నది సర్వంబు శ్రుత పరచుడు.

నా-సీ॥ శశిరేఖనభిమన్యు జనపాలునకునిత్తు। ననిబలుండునుదల్పనదివలదని
దుర్యోధనునిసుపుత్రునకివ్వసమకట్టి। తద్వార్త నేనుసుభద్రకును దెల్పివచ్చి
మిమ్ములవేడ మెచ్చుకున్న ఘటోత్క। చునిజేరి ఈవార్తవినిపినంతఅట్టె
ఘనుండుమాయాంగనయైవచ్చి। మీసుపుత్రిసితన వాసమునకుగొనియుచం
గియునభిమన్యునకునొసగి। యిచ్చటికివచ్చిజేసెవాడింతపనియు కడగి
దుర్యోధనునిమద గర్వమణచ। గాదెనాకిష్టమిట్టుల కమలనాభ॥

వ॥ దేవా నాదుర్యోధనుని గర్వంబణచగోరి యింతపని జేయించి నాడను స్వామి యిప్పుడు మీరుంబోయి సుభద్రాభిమన్యులను దోడ్కొని రావలయును.

బల—వ॥ సరి మంచిది కృష్ణా మనము సుభద్రాభిమన్యు శశిరేఖలను దోడ్కొని వత్తము రమ్ము పోదము.

కృ—వ॥ మంచిది అన్నయ్యా యటులయిన పోదము పదము.

సుభద్రాభిమన్యు శశిరేఖ ప్రవేశం బలభద్రుడు కృష్ణుండు.

వ॥ స్వామీ బలదేవా మీకడె నమస్కారి పున్నవారము కటాక్షించుడు ( బలరామస్వామి శశిరేఖ నెత్తుకొని ముద్దాడి )

వ॥ ఆహాహా సోదరీ సుభద్రా నీసాహస వితరణాది గుణంబులకేను సంతసించినాడను కాని నా మనవి వినుము.

సు—వ॥ అన్నయ్యా అదేటిమనవి.

వాదం—బ॥ రాగదే సుభద్రమా దు రాణివాసమునకు నీవు । బాగు బాగు మదినిను పదిభాగముల నుతించవలెను । జాగులేకసుతునితో యను రాగము సంధిల్ల నిపుడు ॥రా॥

వ॥ సుభద్రా మీరీ యరణ్యంబున నుండనేల ద్వారకాపురంబు ప్రవేశింపవలయు అశ్రద్ధ వలదు.

సు॥ యేటికీయాజోలిమాకు యేవిధయినయొప్పనన్న । మాటిమాటి కిరాని మాటలు నన్నాడెలెదె సాటివారిలో నగుబాటులాయె నయ్యయో॥

వ॥ అన్నయ్యా మేమాపిల్లలము మీగృహంబునకువచ్చియుండు నది ముఖ్యంబుగాదు మీనాటివారు మెచ్చరు నమ్మిమళ్ళిపొమ్ము. మేమి చ్చటనే యుండువారము.

బ॥ సోదరీ నేనెంతో యపరాధినైతి తోచకనె । నాదుసుతను మీ కొసంగరాదని యన్యులు నన్నిటు । బోధించరెంతో నేడా బోధనలకు చిక్కితిహా ॥సో॥

వ॥ సోదరీ యితరుల మాటలు విని యెంతమాత్రము దూరభారము విచారించక నిన్నునోర్ని మాటలు పల్కితిగాన యిట్టిలోట నెరుంగను క్షమింప వలయును.

సు॥ విందునేమావాలపోరి నందనందనునిసాక్షి । యెందుకుమీరిటు లను నన్నిందున బతిమాలెదమీ । సందనగ దోడ్కొని మీమందిరమున కరుగుడి నే॥

వ॥ అయ్యా నీకోమార్తైను కాసి యుండనోపకున్నను తోడ్కొని పొమ్ము మేమువచ్చునది యబద్ధము మీరనువాక్యంబులెల్ల నామనస్సుకు

విశదముయ్యె యున్నవి యేలా యీనెమ్ము పిశాచస్త్రీలు రణ బుమాని నను తెచ్చినన్నంబు మానవముగదా.

వాదం-బ॥ చలమిది యేటనలదె సుశీలా । చెలికడరో నేనెలిఁచున యీస్థితి । ఫలమటే సికీ పంతముచాలా॥

వ॥ జననీ సుభద్రా నేనిట్లు ఓవాదంబె వేడుచున్నను నీకింత కారుణ్యంబు రాకయున్నది ధర్మమా యిట్లు లౌనఁచు నేనెరుఁగనుగదా.

సు॥ నూతన ప్రియములీతరి ఘనయుఖ్యాతిగఁ గల్గు గాని తెలిసె నిన్నే తెరినమ్ముదు ప్రీతిదలిర్పా॥

వ॥ అన్నయ్య నీవాడు నూతన ప్రియోక్తులెల్లను నాకుం దెలుసును గాని మళ్ళి మీగృహంబునకు మేమురాదె చాట ముఖ్యంబుగాదు మీరు శ్రీమంతులు పలువిధంబుల మాటలాడగలరు యేను నమ్మను.

బ॥ దయలేనిమాట । తగదేయీపూట । ప్రియమున నేనాడు నయవాక్కుతో నాన్యథా । రయమున మీరిటు రాండి సుశీలా॥

వ॥ అమ్మా సుభద్రా మళ్ళి మిక్కిలి మాత్రము సూనంబుగా జూడను నామాటనమ్మి దయతోడ నీకోడలును మాయింటగూడి వచ్చేయుతల్లీ.

సు॥ యేలా మీజోలి । యెన్నదజాలీ । శీలమానాలపురి నీలవస నయీ । లలనాతో బల్కుటే చాల్ చాలు॥

వ॥ అన్నయ్యా మీగృహంబునకు మేమువచ్చుటకు నామనంబెంతమాత్ర మొప్పకున్నది యెందుకనగా పెండ్లికిబోయి వలసబోయినట్లుండును గదా.

కృ-వ॥ సోదరీ సుభద్రా సర్వేశ్వరుఁడగు యీబలభద్రుండు వేడు చున్నను మనవంటి పిన్నలము వినక యుండుట ముఖ్యంబుగాదు నామాట నమ్మి మీరెల్ల ద్వారకకు రావలయు అన్నయ్యను చిన్నబుచ్చకుము.

సు-వ॥ అన్నయ్యా మీయాజ్ఞకు వేరొండు విచారంబులేదు అట్టు లనే వచ్చుచున్న వారము పదుండూ.

వాదం-కృ॥ సరెమంచిది సంతోషమాయె । పురిజేర వచ్చితిరి మిమ్ముమెచ్చి వరదక్షిణిచ్చి కరుణింతు హెచ్చి॥

వ॥ సోదరీ మనమిదే ద్వారకాపురంబు జేరి యుంటిమి నీకోడలిని కుమారుని రక్షింపుము వందకుణ నొసంగెదము.

సు॥ అన్నయ్యా మాకాధారమీవె । మన్నించుకోరిమానాలశౌరి సన్నాండభూరి సేవింతుకోరి॥

వ॥ అన్నయ్యా మీరనువిధంబునసే శశిరేఖాభిమన్యులను రప్పించితి ఆశీర్వదించి యరణంబొసంగుము.

కృ-వ॥ సరిమంచితి బలదేవా నునమిచ్చోట గూర్చుండుమురమ్మా.

బలరాములు-వ॥ కృష్ణా కరించిచిది సటికి నామనంబు సంతిసించెను యిట్లు బలరామకృష్ణులు సుభద్ర శశిరేఖాభిమన్యులను సంతోషింప జేసి సుఖంబున నుండిరంతి.

-♦ మం గ ళ హా ర తి ♦-

మంగళమిదుగోరామా ॥జయ॥ మంగళకరగుణధామ । సంగీత సువేదాంగవినుత సాంగ నయనసారంగధర ముఖా ॥మం॥ కరివరదాచ్యుతా శౌరీ నీ । సరిమెవ్వరు నగధారీ । పర ్దయూకర । భ క్తమనోహర । సురవరవందిత సుందరవిగ్రహా ॥మం॥ మానాలపురీవాస సన్మానిత వేదవ్యాస మీనకేతన సమానరూప సుజ్ఞానమానస నిధానజనార్ధన ॥మంగళ॥

శ్రీగోపాల కృష్ణార్పణమస్తు.

శశిరేఖా పరిణయ నాటకము - సంపూర్ణము.

---

కొండా శంకరయ్యగారి ప్రీమియర్ పవర్ ప్రెస్‌నందు ముద్రింపబడియె.
గంజిబజారు, శికింద్రాబాద్-ద.

శతాధిక గ్రంథకర్తయగు

# శ్రీయుత చెర్విరాల భాగయ్య కవిగారిచే రచియింపఁబడి, ప్రదర్శింపఁబడి ప్రశంస వహించిన యక్షగానములు. ప్రతి 1 కి రూ 0--12--0

సుగ్రీవవిజయము
(మహారాబాదపై అంకితముగలది)

కనకతారచరిత్రము
(వడ్డేపల్లిపై అంకితముగలది)

కాంతామతిచరిత్రము
(వడ్డేపల్లిపై అంకితముగలది)

సత్యభామాపరిణయము
(వడ్డేపల్లిపై అంకితముగలది)

జయంతజయపాలము
(వడ్డేపల్లిపై అంకితముగలది)

శ్రీకృష్ణరాయబారము
(వడ్డేపల్లిపై అంకితముగలది)

మాధవచరిత్రము
(వడ్డేపల్లిపై అంకితముగలది)

సత్యహరిశ్చంద్ర
(మహారాబాదపై అంకితముగలది)

సారంగధరచరిత్రము
(మహారాబాదపై అంకితముగలది)

శ్రీకృష్ణతులాభారము
(మహారాబాదపై అంకితముగలది)

అరెమరాటీలచరిత్రము
(మాధాపురముపై అంకితముగలది)

[illegible]హానచరిత్రము
(మహారాబాదపై అంకితముగలది)

[illegible]ండేయవిలాసము
(గుమ్మడిదాలపై అంకితముగలది)

[illegible]ర్జునచరిత్రము
(బీరంగూడెంపై అంకితముగలది)

కాంభోజరాజుచరిత్రము
(మహారబాదపై అంకితముగలది)

పుండరీకచరిత్రము
(చింతలచెరువుపై అంకితముగలది)

మాయామశ్చీంద్రవిలాసము
(మాధాపురముపై అంకితముగలది)

సైంధవపరాభవము
(మాధాపురముపై అంకితముగలది)

తారకాసురవధ
(గుమ్మడిదాలపై అంకితముగలది)

గయోపాఖ్యానము
(మహారబాదపై అంకితముగలది)

సతీతులసీచరిత్రము
(భానూరుపై అంకితముగలది)

నలమహారాజుచరిత్రము
(రాజంపేటపై అంకితముగలది)

నోటు:— ఇవిగాక యింకా మీకు కావలసిన పుస్తకములకు

## కొండా శంకరయ్య

పుస్తకముల వ్యాపారము, మహంకాళివీధి, సికింద్రాబాద్ (దక్కన్)

(అని వ్రాయుడు).